# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

**353**


సెప్టెంబరు, 1983

సంపుటి : 30, సంచిక : 6

వార్షిక చందా : పది రూపాయిలు

విడిప్రతి : ఒక రూపాయి



ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

# శ్రద్ధాంజలి



కీర్తిశేషులు శ్రీ శీర్లబ్రహ్మయ్య

జననం : 10-6-1913 మరణం : 8-8-1983

# ఈ సంచికలో

# కీర్తిశేషులు శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు

స్వాతంత్ర్య సమర యోధులు, గాంధేయవాది దక్షిణ భారత హిందీప్రచార సభ, ఆంధ్ర అధ్యక్షులు శ్రీ శీర్లబ్రహ్మయ్యగారు గుండెపోటు వల్ల మద్రాసులో ది 8.8-1988నాడు దివంగతులైనారు. సామాన్య కుటుంబంలో పుట్టి, బాపూజీ నిర్మాణ కార్యక్రమాలపట్ల ఆకర్షితులై హిందీ భాషను ఆ రోజుల్లో అభ్యసించి, ఏలూరులో బాలమిత్ర మండలి స్థాపించి వందలాది యువకులకు ఉచిత హిందీ భాషా బోధన చేస్తూ వారిలో చాలా మందిని స్వాతంత్ర్య సమర యోధులుగా తీర్చిదిద్దారు. తాను అనేక పర్యాయాలు కారాగార శిక్ష ననుభవించారు పిన్న వయస్సులోనే ఏలూరు పురపాలక సంఘాధ్యక్షులుగా ఎన్నికై ఆ పట్టణానికి సేవచేశారు. ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. రాజకీయ రంగంలో నీతి నిజాయితీ గానడుచుకోవాలని కాంక్షించే బహు కొద్ది మంది పెద్దలలో వారు ఒకరు, అవినీతిని చూచి ఆవేశ పడే మనస్తత్వం కావడం వలన యీనాటి కాంగ్రెస్ రాజకీయాలలో రాణించలేక పోయారు. ప్రారంభం నుంచి అనేక ఒడిదుడుకులువచ్చినా అటు రాజకీయ రంగంతో బాటు యిటు హిందీ భాషా ప్రచార రంగంలో కూడా పనిచేస్తూ వచ్చారు. హిందీ బ్రహ్మయ్యగా ప్రచారంలోకి వచ్చారు. చివరి రోజుల్లో తమ పూర్తి సమయం హిందీ రంగానికే వెచ్చించారు దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖకార్యక్రమాలకు అధ్యక్షులుగా ఆధ్వర్యం వహించారు.దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారి పని మీద వెళ్ళి గుండెపోటుతో ఆసుపత్రిలో చేరి నయమై యింటికి రావాలని అనుకొంటున్న సమయంలో మళ్ళీ గుండెపోటు వచ్చి శాశ్వతంగా కన్నుమూశారు. వారి ఆత్మకు శాంతి ప్రసాదించవలసినదిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

వారికి సేవ చేసేందుకు మద్రాసు వెళ్ళిన వారి యిద్దరు కుమార్తెలు, యిద్దరు అల్లుళ్ళు, మనమడు, అన్న కుమారుడు వారి మృత దేహాన్ని ఏలూరు పట్టణానికి తీసుకొనివస్తూ త్రోవలో ప్రమాదకరమైన దుర్ఘటనకు లోనుకావడం, కన్న కొడుకుల కంటె ఎక్కువగా సేవచేసిన వారి యిద్దరు అల్లుళ్ళు అక్కడి

కక్కుడె మరణించడం మిక్కిలి విచారకరం. మిగతా వారు తీవ్రంగా గాయపడి మృత్యు ముఖం నుంచి బయటపడటం కూడా విధివిలాసమే.

ఇంతటి పెద్ద ఆఘాతానికి గురైఅయి యింతవరకు తేరు కొనని వారి కుటుంబ సభ్యులకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ పక్షాన సానుభూతిని తెలుపుతున్నాం. పరమేశ్వరుడు వారి ఆత్మలకు శాంతి ప్రసాదించుగాక.

ఓం శాంతి: శాంతి: శాంతి:

# శ్రద్ధాంజలి

ప్రసిద్ధ హిందీ ప్రచారకులు, తెలుగు హిందీ భాషా పండితులు (రచయితలు.)

శ్రీ రాచకొండ నరశింహ మూర్తిగారు, జిల్లెళ్ల మూడి శ్రీ దేవరకొండ సనత్కుమార శర్మగారు. మచిలీపట్టణం ఈ మధ్యనే అస్వస్థతకు గురిఅయి కన్నుమూశారు.

వారిరువురి ఆత్మలకు శాంతి ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

—సంపాదకులు

# ప్రథమాచార్యుడు

—కొంపెల్ల రామకృష్ణమూర్తి

శ్రీవాణీ గిరిజాశ్చిరాయ యనుచున్ శ్రీకారముం జుట్టి-వా
గ్దేవీ మంజుల కచ్ఛపీరవళికాంధ్రీ కంఠ మాధుర్యమున్
నీవే కూర్పకయుండిపోయిన మహాంధీ భూతహృద్రంగమై
ఏవోగాలుల తేలిపోయెడిదికాదే తెల్గు ముమ్మాటికిన్.

దేశ్యమనగ నొక్క దివ్య ప్రవాహము—
కదలుచుండునద్ది కాలమువలె
అనుచు నాడె పలికి యాగామి సాహిత్య
రీతి తలచినావు ఋషిసముడవు!

స్వస్థాన వేషభాషల యందు తులలేని
రక్తి కల్గించు సూత్రము ఘటించి
పామర వ్యవహార భాషా మహాంభోధి
లోనున్న రత్నాలు సానబట్టి
తత్సమ; దేశ్య; తద్భవ శబ్దములకెల్ల
అక్షర రమ్యతనందజేసి
గీర్వాణవాణి కంకితమైనవ్యాసర్షి
కవితాత్మనాంధ్ర లోకమున నిలిపి
భారతాఖ్యము దివ్యసౌభాగ్య మొకటి
తరతరాలుగ జాతికి దక్కునట్లు
చేసియున్నాడవు 'తెల్గు ప్రాచేతసుడ'వు
శతనమస్సులు నన్నయాచార్య! నీకు.

(ఆదికవి నన్నయ స్మారకోత్సవ సందర్భముగా).

రామకృష్ణాపురం పోస్టు
ఆదిలాబాద్ జిల్లా 504301

# ప్రథమాంధ్ర మహాకవి నన్నయగారి హితవు

—మల్లాది రామచంద్రశాస్త్రి

(అప్రకటిత మహాస్వప్న కావ్యము నుండి)

"రాజ రాజ మకుట
రత్న కాంతులు తన
పాదముల వసించు
భవ్యయశుడు
నన్నపార్యు డిట్లు
నాతోడ బల్కెను
హిత వొకండు గలదు
మతి వినుమని.
"నవరసాత్మకమ్ము
ప్రవిమలరసధుని
జీవితమ్ము మున్ను;
చేవదరుగ
నీ రసాత్మకమ్ము
నిర్జీవమయ్యెనో
రమ్య సుగుణ సాంద్ర
రామచంద్ర!
పారిజాత పుష్ప
పరిమళమును మించు
భావ పుష్పజాత
పరిమళమ్ము.
సత్కవీంద్రు హృదయ
సరసీ రుహము నెన్న
నంబు జమ్ము కన్న
నవని మిన్న.
ప్రజల భాషలోన
భారత మాంధ్రీక
రించినాడ; వేడ్క
నించ నాంధ్రిఁ
కొంత వరకు; కాని
కోరిక సఫలము
గాకమున్న గంటి
నాకమేను.
ఆంగ్ల పదములిప్పు
డధికాధికమ్ములు
భారతమున సకల
భాషలందు
సమధికములు నాడు
సంస్కృత పదములు
భారతమున సకల
భాషలందు.
సంస్కృతమ్మొకప్డు
సకల భారతమున
ప్రచలితమ్మదనుట
ప్రాజ్ఞు మాట

శాస్త్ర నిచయ మరయ
సంస్కృత మందున
వెలసె దాన నచట
విలసితముగ.
సంస్కృతమ్ము మొదట

మాతృభాష లౌను
మహిత బుద్ధి
నాంధ్ర జాతి కనుట
బంధురమౌ సత్య
మాంధ్ర పదమె సంస్కృ
తమ్మదౌట,
సంస్కృతమ్మునందె
సకల పురాణముల్
కలవునాడు; వాని
కలిమి వలన
ప్రజలలోన నపుడు
ప్రబలము సంస్కృత
పదములందు మమత
పరిణతి గనె.
సమధి కములునాడు
సంస్కృత పదములు
వ్యవహారికమున
వాస్తవమ్ము.
కారణమ్ముకలదు
కనుడు; సంస్కృత పురా
ణముల ప్రవచనమ్ము
గన సమృద్ధి.
శాస్త్ర విహితమైన
సత్కర్మ చేసెదా
ప్రజల సంస్కృత ప్ర
భావితులను,
కూర్చినాడ నేను
గురు సమాసమ్ముల
నాటి ప్రజల వాంఛ
ధాటి నరసి.
కానలేక సొగసు
పూని సమాసమున్
వెక్కిరించు వాడు
వెర్రివాడు;
పుట్టు గ్రుడ్డియొకడు
పున్నమ చంద్రుని
వెక్కిరింప దానె
వెకిలియౌను.
ఆంధ్రమన్న పదమె
యది సంస్కృతమ్మని
తెలియుడీరు; దాని
విలువదెలిసి
భారతాత్మ నరసి
భాస్వదైశ్వర్యము
గాంచుడీరు; సుఖము
గాంచుడేరు!
"యావద్భారత
భావ సమైక్యమ్।
యావద్ధరణీ
శాంత్యభ్యుదయః।
వ్యక్తి వికాసో
విశ్వశ్రేయః।
భూయాత్ భారత

వర్షే ధ్యేయః॥''
భారతాత్మ దెలియ
భారత సంస్కృతి
ప్రాభవమున నాత్మ
ప్రాభవమును
గాంచ; సంస్కృతమ్మె
కనుమ; శరణ్యము
విజ్ఞమలయ జాల
రజ్ఞులవని.
సంస్కృతమ్మ టన్న
సరిపడ నట్టి వా
డార్ష ధర్మమునకు
నరియతండు;
భారతుండు గాడ
భారతు డవ్వాడు
బద్ధ శత్రువతడు
భరత భువికి.
నాటియాంధ్ర జగతిఁ
నేటి యాంధ్రముగన
దంధకారమలమె
నాంధ్రి నేడు;
కళ కుమారు ప్రేత
కళ చెల్లునట నేడు
మిహిరు బరిహాసించు
మిణుగు రచట.
''కవులలోన గొప్ప
కవియెవ్వ'' డోనని
ఓట్లు పుచ్చుకొనిన
నోడిపోరె ;

కాళిదాస ముఖ్య
కవివరు లెల్లరు
కవియె కానివాడు
కడకు గెల్వ.
కవుల గారవించు
ఘనులు కానరారట
కాకవి తతిఁగొల్చు
కలుషమతులు
కలరు పెక్కురచట
ఖలులు, దుర్మార్గులు
రమ్యసుగుణ సాంద్ర!
రామచంద్ర!
కలదు భాస్కరునకు
ఖద్యోత నామమ్ము
కలదు మిణుగురునకు
కలిగినంత
మిణుగురౌనె! తాను
మిహిరుడీ జగమున!
కాకి నలుపదౌట
కోకిలగునె!
శాస్త్రవిజ్ఞానవృద్ధికి శబ్దచయము
సంస్కృతమునుండి గ్రహియింప
సముచితమ్ము
భారతాత్మ ప్రభాభాసితమ్మదౌట;
కొంతలో కొంత నాంగ్లము
కోరదగును.
తగదు కోరగ 'తవ్వోడ'
తగదు కనుడు!
దేశవిచ్ఛిత్తిదాన: వినాశకరము
మార్గమదియౌను;

'దొంగోడ' మరియు హాని
కరము; భారత విచ్ఛిన్న
కరము; కరము.
ఉన్నదున్న యట్లు
కన్నది కన్నట్లు
చెప్పగల్గువారు
గొప్పకవుల!
ఉండవలయు రీతి
నుత్తమోత్తమముగా
చెప్పగల్గువారె
గొప్పకవులు.
తెలియవలయు, తేట
తెల్లమ్ము గానంద్రు
తెలివిలేని వార
లిల సుకవిత;
తెలిసికొనగవలయు
తెలివి సంపాదింప
వలయునంద్రు; విలువ
తెలియు బుధులు.'

—విజయసాహితి'
విశాఖపట్టణము

# శ్రీశ్రీ మహాప్రస్థానం

—పైడిపాటి సుబ్బరామశాస్త్రి

1. ఎక్కడకు వెళ్ళావు ? శ్రీశ్రీ
ఇక్కడ ప్రజల నేమి చేసి వెళ్ళావు ?

*  *  *

2. జగన్నాథుని రథచక్రాల్ వచ్చేస్తున్నాయని
జగతిమార్గం వాటిని పట్టిస్తానని
అర్ధశతాబ్దం క్రిందట ఆశపెట్టి
అవి పట్టకుండానే వెళ్ళిపోయావేం శ్రీశ్రీ !

*  *  *  *

3. పీడితప్రజల తరఫున నేనున్నానని
బొమ్మ విఱచి నిలబడ్డావు
వాళ్ళంతా నిన్ను నమ్ముకుంటే-
నీవు గప్‌చిప్‌గా వెళ్ళిపోయావు,

*  *  *  *

4. దేశవాళీ కవిత్వంలో ఎల్లా పిల్లి మొగ్గలు వేయాలో
నీకు తెలిసినంత ఇతరులకు తెలియదు
దాని ననుకరింపలేక, ఎందఱో పిల్లులై పోయారు;
ఇక - ఇంత శబ్దచిత్రం చేయగల వారెవ్వరు ?
అకటావికటవు కవిత్వమనీ, మాటలగారడీ అనీ, వెక్కిరిస్తారు !

*  *  *  *

5. ఇది కుళ్ళిన సంఘమన్నావు
వయసు మళ్లినవాళ్ళను చావమన్నావు
సంఘం, ముదుసళ్ళూ అల్లాగే ఉన్నారు
పండువంటి నిత్య యువకుడవు
భజగోవిందం పాడేశావు

మరోప్రపంచం వస్తుందనీ,
పదండి ముందుకనీ, ప్రజలను హెచ్చరించావు-
అది వచ్చిందో లేదో కాని- ఇప్పుడు నిన్ను
మరోప్రపంచం పిలిస్తే, మహాప్రస్థానం చేశావు

*　　*　　*

8. తైలధారోపమంగా, అవిచ్ఛిన్నంగా
ధూమపానం చేసే నీ మూర్తి
కాలగర్భంలో కలిసిపోయింది-
అయినా, నీ రెండు నామాక్షరాలూ
వాఙ్మయ చరిత్రలో నిలుస్తాయి !

*　　*　　*

9. ఈ శతాబ్దం ఆదిలో నీవు పుట్టకపోయినా,
అంతంలో ఉండవని తెలియకపోయినా-
ఒక ఉమ్మస్సుతో ఈ శతాబ్దం నాదన్నావు !
అని, దశాబ్దం కూడా కాలేదు.
కాలుడికి దాక్షిణ్యం లేకపోయింది !

— మారుతినగరం
విజయవాడ-4

# ఈనాటి ఇతిహాసం

తమిళ మూలం : —అభ్యుదయకవి అబ్దుల్ రహమాన్

తెలుగు సేత : అంగేరి సుబ్రహ్మణ్యం

ఇదో ఇక్కడ—

తలకిందులుగా వెలిగే దీపాలు
ఈ యుగంలో
తలకిందులుగా నడిచే ధర్మానికి
ప్రతిరూపాలు !

అదో అక్కడ—

ప్రతి అవతారానికీ అవరోధంగా
ఎక్కడ చూసినా
ఎర్ర త్రికోణ కంసాసురులు!

ఇవి—

వేషం మార్చుకున్న యోగి
వేమన్నలు
సావిత్రీ దమయంతుల పేర్లతో
రెడ్‌లైట్ ఏరియాలో
వేటసాగించే రోజులు !

మాలో కోకొల్లలు—

కామం కోసం
ధర్మార్థ మోక్షాలను ఉపదేశించే
'న్యూవేవ్' 'పంచమ' సశేష నవలలు
విసుగూ విరామం లేకుండా రాసి
పడేసే
వ్యాస-భగవానులు !

మా సోదరులు—

కృష్ణభగవానుల గీతాశ్లోకాల
మాధురిలో
ఎదమరచి
ఉన్న అటుకులను సైతం
గాలికి వదిలే కుచేలురు !

మాకు తారసపడే ఆదర్శమూర్తులు—

భారాలన్నిటినీ తామే త్యజించి
సంపదారణ్యాలలో
సౌఖ్య శూర్పణఖలతో
నగ్నంగా తిరిగే శ్రీరామచంద్రులు
బంగారులేడి కోసం
లంకేశులతో లేచిపోయే
సీతామతల్లులు !

మా అభిమాన వినోదం—

కౌరవుల అయోమయ సభలో
పాంచాలి కాబరే నాట్యం

మా సమాజం—

సంఖ్యాబలమే ధర్మంగా సాగే
కురుక్షేత్ర సంగ్రామం
అందుకే
విజయాలన్నీ కౌరవులకే అంకితం!! *

చందమామ బిల్డింగ్స్
మద్రాసు 600026

# దేశం కాగితం మీది బొమ్మ కాదు

హిందీమూలం— సర్వేశ్వర సక్సేనా
అనువాదం- చిలకమూరి సంజీవ

నీ ఇంటిలోని
ఆ గదికి నిప్పంటుకుంటే
ఈ గదిలో పడుకోగలవా?
ఆ గదిలో శవముంటే
ఈ గదిలో పాట పాడగలవా?
ఆ గదిలో శవాలు కుళ్ళిపోతే
ఈ గదిలో ప్రార్థన చేయగలవా?
నీవు అవునంటావా!
నీతో చెప్పవలసిందేమి లేదంటాను.

ఒక భాగం విడిపోతే
మిగతా భాగాలు సామ్రాజ్యాలుగా
నదులూ, పర్వతాలు, నగరాలు,
గ్రామాలు
వాటివాటి స్థానాల్లో స్తబ్దంగా వుండి
చూడటానికి
దేశం కాగితంమీద గీచినబొమ్మ కాదు
నీవు దీనిని ఒప్పుకోనంటావా?
నేను నీతో వుండనంటాను.

ఈలోకంలో మనిషికంటె మించింది లేదు.
భగవంతుడు,
జ్ఞానము,
ఎన్నికలు,
రాజ్యము, రాజ్యాంగమూ ఏవీకావు.
వీనిపైన వ్రాయబడిన
ఏ వ్యాసమైన చించి పారేయవచ్చు
భూమిలో పాతిపెట్టవచ్చు.
కుళ్లిన శవాలకంపుతో వచ్చిన
వివేకము గుడ్డిది.

తుపాకుల గొట్టాలతో నడిపించే పాలన
హంతకుల వ్యాపారం.

జ్ఞాపక ముంచుకో!
ఒక పసివాని హత్య
ఒక యువతి చావు
తుపాకి గుండ్లతో జల్లెడగా మారిన
ఒక శరీరము వలన
ఒక పరిపాలనే కాదు-
సంపూర్ణ రాష్ట్రమే నాశనమౌతుంది.

రక్తపుటేరులు పారి
భూమిలోని సారాన్ని పీల్చవు.
ఆకాశంలో రెపరెపలాడే
జండాలను సైతం నల్లబడేస్తాయి.
ఏ భూమిమీద
సైనికబూట్ల గుర్తులుంటాయో
ఆ గుర్తులపై శవాలు పడుతుంటాయో
ఆ భూమి
నీ రక్తంలో దావాగ్ని పరుగిడకపోతే
నీ వొక బంజరుభూమివని ఒప్పుకో
నీ కిక్కడ శ్వాసించడానికైన అధికారం లేదు
నీ కొరకిక ప్రపంచమూ లేదు.
చివరికొక నిజమైన మాట
ఏ హంతకునైన క్షమించకు
వాడు నీ స్నేహితుడైన
ధర్మకాంట్రాక్టరైన
కీర్తిని కోరే ప్రజాతంత్ర
నాయకుడైన సరే.

ఎల్లం బజారు
వరంగల్, 506012

# నవల్లో శైలి

డా॥ మాదిరాజు రంగారావు

"Style is a quality of language which communicates, Precisely emotion and thoughts or a system of emotion or thoughts Peculiar to the author"

Middletion Murry
—The Problems of style

శైలి, ఆంగ్ల పదం స్టయిల్‌కు అనువాదం సమానార్థంలో ప్రయుక్త మౌతూంది. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల ఏర్పడిన విమర్శనాంశాల్లో ఇదొకటి. శైలి మనో వికారాన్ని (emotion) ఆలోచనా (Thought) రీతిలో సరిగ్గా వ్యక్తం చేసే భాషా లక్షణం. శైలికీ భాషకూ గల సంబంధం విశిష్టమైంది. ఇందులో శబ్దాలూ వాటి అమరిక, మనోవికారం-ఆలోచన, క్రమ విధానంలో ఆవిష్కారం అనే మూడు అంశాలు ఉన్నాయి. మొదటిది భాషనూ రెండోది అంత స్వరూపాన్నీ మూడోది (అంతర్బహి స్వరూప) విధానాన్నీ భావింపజేసేవి. ఈ మూడు లక్షణాల సమన్వయ రూపంతో అవతరిస్తుంది శైలి. నవల ఆరంభించగానే మొదట (వాతావరణంతో పాటు) ఆకర్షించే లక్షణం. కళ ఉంటేనే తప్ప ఆకర్షణ ఉండదు. కళాత్మకమైన విశిష్ట రూపంలోనే రచయిత వ్యక్తిత్వం ప్రదర్శిత మౌతుంది. సృజన ప్రక్రియమైన నవల్లో ఇది విస్పష్టంగా తన ప్రభావాన్ని నెరపుతుంది. ఒక్కొక్క రచయిత శైలి ఒక్కొక్క విధంగా ఉండటానికి మూలహేతువిదే. ఒకరితో పోలిన వ్యక్తిత్వం మరొకరికి ఉండదు. ఎక్కడన్నా క్వాచిత్కంగా ఏవో కొన్ని సామ్యాలు ఉండవచ్చు. ఒక్కే రచయిత తన వ్యక్తిత్వంలో ఉండే వివిధ పార్శ్వాల్లో భిన్న రీతులుగా రచనలు చేయవచ్చు. ఇది ఆతనినైకముఖ వ్యక్తిత్వాన్ని తెలుపుతుంది. అయినప్పటికీ ఒక సాధారణ లక్షణం అంతర్నిహితంగా సర్వత్రా విలసిస్తూ ఉంటుంది. అది పైకి స్పష్టంగా కన్పించకపోవచ్చు, కాని కళాత్మక విధానంలో రచయిత వ్యక్తిత్వాన్ని స్ఫూర్తికి తెస్తుంది. స్థూలంగా శైలి స్వరూపం ఇది.

వ్యక్తి-ఆకృతి, మాట, నడక, స్పందన ఆలోచన, ప్రవర్తన, దృక్పథం అన్నీ లేదా కొన్ని ఒకచోట సమాహార భూతంగా కలసిన బాహ్యాంతర విధావిధానం; సాహిత్య వ్యక్తిత్వాన్ని భావింపజేసి మనలో ఒక అభిప్రాయాన్ని ముద్రితం చేస్తుంది. ఈ ముద్రలో గాఢత్వం విస్పష్టత, విశిష్టత, వ్యక్తిత్వాన్ని బట్టి ఆకర్షణీయతను కలిగి ఉంటుంది. ఆలాగే నవల్లో శైలి కూడా రచయిత ప్రత్యేకమైన సాహిత్య వ్యక్తిత్వాన్ని ఆవిష్కృతం చేస్తుంది. ఒక్కొక్కప్పుడు నవల అపూర్వ విజయానికీ అపజయానికీ శైలి కీలకమైన పాత్ర వహిస్తుంది. శైలిపై అధికారం ఉన్న రచయిత నవల విస్తృత పరిధినీ, వైవిధ్య పార్శ్వాలనూ, ఏ విషయాన్నైనా తనలో ఇముడ్చుకొనే లక్షణాన్నీ ఎంతో నిపుణులగా అవసరాన్ని బట్టి వినియోగించుకుంటాడు. ఇతివృత్తి నిర్మాణం పాత్ర చిత్రణం వాతావరణ కల్పనం అభిప్రాయ ప్రకటనం మొద

లైన అపరిహరణీయమైన అంశాలకు శైలి, ఆవిష్కార
రూపం. భాష ఆశ్రయ సాధనం. కవిత్వంలో సంక్షిప్త
తగుప్తత వ్యంగ్యంతో సారభూతమైన చిక్కని
సౌందర్యకృతి వెలుగుతూంటుంది. నవల్లో దీనికి
భిన్నంగా వైపుల్యం, స్పష్టత, వివరణంతో శాఖాశ్లి
ష్టంగా అల్లికతో, సౌందర్య రూపం పరచబడి
ఉంటుంది. ఎక్కడన్నా ప్రత్యేకమైన ప్రయోజనాన్ని
మనస్సులో పెట్టుకొని, వ్యంగ్యస్ఫూర్తి ఉండవచ్చు,
ప్రతీకాత్మనూ పొందవచ్చు దీని పద్ధతి, సులభంగా
అవగాహనకు వచ్చే విధంగానే తీర్చబడుతుంది. అసలు
నవల ప్రక్రియా స్వరూపంలోనే, ఎక్కడికక్కడ
విప్పుకొని, అక్కడక్కడ అందుకొని, అల్లుకొనిపోయే
సంశ్లిష్ట లక్షణం ఉంది. ఈ మౌలికమైన రచనా
తత్త్వం శైలీ నిర్మాణంలో మిగతా ప్రక్రియల నుండి
ఎంతో భేదాన్ని కలిగిస్తుంది. అందువల్ల నవల్లో శైలిని
పరిశీలించే దృక్పథం వేరుగ ఉండవలసి వస్తుంది.
కవిత్వం లేదా నాటకం కొలమానాలు దీనికి పూర్తిగా
అన్వయించవు.

మంచి నవల్లోని శైలి అనువాదంలో తీసుకొని
వచ్చే వీలుందా? అని ప్రశ్న! అనువాదంలో మూల
రచనలోని శైలి నిస్సందేహంగా లోపించే మాట నిజం.
(1) శబ్దాల సహయోగం వాక్య విన్యాసం (2) ఆలో
చన-మనోవికారం (3) ఇది క్రమ విధానంలో ఆకర్ష
కమైన సామరస్యంతో అవిష్కృతం కావడం శైలి
అనుకుంటే, మొదటిది, భాషాగతమైందీ, బాహ్య
రూపానికి సంబంధించిందీ అనువాదంలో తీసుకొని
రావడం కష్టమైన పనే. రెండోది అంతస్తత్త్వానికి
సంబంధించింది కొంత సులభం. ఇదీ శైలీ నిర్మాణంలో
భాగమేనన్న సంగతి మరచి పోకూడదు. మూడోది
పై రెండిటి యొక్క కలయిక చేత ఏర్పడిన రూపమే
కాబట్టి, దీని విజయంపై రెండిటి పైన ఆధారపడిన
అభివ్యక్తి లక్షణాన్ని భావింపజేస్తుంది. అనువాదంలో
కూడా కొంత ప్రయత్నించి మొదటి దాన్ని కొద్దో
గొప్పో సాధించవచ్చు. అదీ సోదర భాషలైతే కొంత
సులభం. ఒకే సంస్కృత శాఖలోని భాషలైతే అవ
కాశం ఎక్కువ. సృజనాత్మక రచనల అనువాద విష
యంలో రచయిత తన వ్యక్తిత్వాన్ని పరిహరించు
కోవడం కుదరదు. అతడూ రచయిత అయితే, సృజన
శక్తి ఉద్గమనాన్ని నిరోధించలేడు, ఏమైనా, మూల
రచనలోని భాషాగతమైన సంపూర్ణశక్తినీ, శైలీ రామ
ణీయకతనూ అదే ప్రమాణంలో, రీతిలో అనుభవానికి
అందించలేక పోవడం, వాస్తవం, దీని వెనుకనున్న
అంతస్తత్వం అవిష్కృతమైన అల్లిక (texture)
లోని రీతి (Pattean)ని అందుకోవచ్చు తాను అను
వాదం చేసే భాషానుగుణంగా, తన వ్యక్తిత్వం తొంగి
చూచే విధంగా శైలి సంపాదిత మౌతుంది. ఇది అని
వార్యం. అనువాదకుడు అనువాద సందర్భంలో
రచనా పరమైన నిమగ్నత వల్ల, అనుభవ గాఢత్వం
వల్ల తనకు తెలియకుండానే, చేస్తాడు. ఇది ఇతరమైన
నవలా లక్షణాలతోనూ ముడివడి ఉంటుందన్న విష
యాన్ని మరవకూడదు. విక్టర్ హ్యూగో (ఫ్రెంచి)
టాల్‌స్టాయ్, డాస్టొవస్కీ (రష్యన్) మహా రచయి
తల రచనలు ఒక భాష నుండి మరో భాషలోకి,
అందులో నుండి తిరిగి ఇతర భాషల్లోకి పరివర్తితం
అయ్యేప్పుడు శైలీ గతమైన మౌలికతను యథా
తథంగా నిలపడం సాధ్యం కానప్పుడు ఎలా ఆనంది
స్తున్నాం? అంటే శైలితో ముడివడి, శైలికన్న భిన్న
మైన ఇతర లక్షణాల సంవిధానమూ దీనికి దోహదం
చేస్తుంది. రచనలో ఇతివృత్తం - పాత్ర చిత్రణం
జీవిత దర్శనం, తోపాటు స్పందన, ఆలోచన మొద
లైన లక్షణాల సహకారం, నవల పరి పూర్ణమైన
స్వరూపానికి ఎంతో అవసరం. మరో వైపు నుండి
చూస్తే అనేక విషయాలచేత యోజితమయ్యే, నవల్లో
శైలి ఏక దేశం మాత్రమే ఒక్కొక్కప్పుడు, అందు
లోని ఏవైనా స్వల్పమైన లోపాలు శైలిచేత పూరింప
బడవచ్చు. సాహిత్య కళకు అవసరమైన మౌలికలక్ష

జాల్లో ఒకలైన శైలి, కనీస స్థాయిలో రామణీయ కతను సంతరించుకోకపోతే రచన పఠన యోగ్యంగా ఉండదు. విసుగుపుడుతుంది; చివరి దాకా చదివే అభి లాష సన్నగిల్లుతుంది. దీన్ని స్థిరంగా నిలపడం రచ యిత కర్తవ్యం.

నవల్లో శైలికి సంబంధించిన మరికొన్ని అంశా లున్నాయి. ఒక విషయాన్ని గురించి వ్రాసేటప్పుడు దానికి సంబంధించిన సాంకేతిక, లేదా ప్రత్యేకమైన శబ్ద జాలం - భాష ఉపయోగించవలసి ఉంటుంది. తత్త్వం - శాస్త్రం లేదా ప్రత్యేకంగా వృత్తికి సమా జంలో అంతస్థులకూ సంబంధించింది. ఇది "వాతా వరణం"తో ముడివడింది. భాష-శైలి, వీటిలో ఒక దాని నుండి మరో దానిలోకి నవల్లో మారుతూ ఉం టుంది. మోబీడిక్ (మెల్‌విలె)లో తిమింగలాల వేట గురించి వ్రాసేప్పుడు రచయిత ప్రత్యేకమైన క్షేత్రా లను పరామర్శిస్తాడు తత్త్వశాస్త్రం నుండి భూగర్భ శాస్త్రం దాకా విజ్ఞానాన్ని ప్రదర్శిస్తాడు. సముద్రంపై జీవితం గడపే వృత్తికారులకు సంబంధించిన వాతా వరణంతో కొత్త ప్రపంచాన్ని దర్శింపజేస్తాడు. దీనికీ భాషకూ శైలికీ సంబంధం ఉంది. మొత్తం మీద ఇది ప్రతీకాత్మకంగా (Symbolic) నిర్వర్తితమైంది. ఇది వేరే విషయం. ఒక్కొక్కపుడు ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికీ, ఒక దేశం నుండి మరో దేశానికీ కథారంగం మారినపుడు ఆ ప్రాంతం, దేశం లోని స్థానికమైన చిత్రణం పురస్కరించుకొని భాష-శైలి సంపాదిత మౌతుంది. మరొకపుడు రచయిత విజ్ఞాన ప్రదర్శకమైన శైలి-నవల్లో కథనం పాత్ర చిత్రణం, కేవల వర్ణనంలోనూ కన్పిస్తుంది. వేయి పడగల్లో వర్ణనలు [వెన్నెల వర్ణనం..."అపహరింప బడిన వేదముల కాంతులు మరల బ్రహ్మదత్తములై ప్రకాశించినట్లు...] కల్యాణోత్సవాల సందర్భంలో ఆయా విషయ విజ్ఞాన వివరణంలో శైలి ప్రౌఢంగా, ప్రజ్ఞా సమర్పకంగా ఉంది. ఇదే విధంగా మాల పల్లిలో రామదాసు తత్త్వ చింతనంలోనూ కన్పిస్తుంది విశ్వనాథ, గ్రాంథికంలో నిబిడమైన శైలిని, ఉన్న విశిష్ట వ్యావహారికంచేత పుష్టమైన శైలినీ పాటించే ధోరణి కన్పిస్తుంది. చివరకు మిగిలేది, నవల్లో కోమలి పాత్రతో స్ఫూర్తిమంతగా ప్రకృతి వర్ణనమూ పరిశీ లింపతగింది. ఇదే నవల్లో మరో ప్రయోజనాన్ని నిర్వర్తించవచ్చు అది వేరే విషయం, పైన పేర్కొన్న రచనల్లో భాష, శైలికి సంబంధించి నంతవరకు కొన్ని పరిమితులున్నాయి. ఇది వాతావరణంతో స్థగితం కావడంతో పరిధి విస్తృతమౌతుంది. అలాగే ఇతి వృత్తం, పాత్రతో సంబంధం కలగడంతో మరో పార్శ్వంలో భాగమై పోతుంది. అందువల్ల అన్యోన్యా శ్రయం, పరస్పర సంబంధంచేత పరిపూర్ణ స్థితిని పొందే నవల్లోని 'శైలి'ని గురించి ఎంత వ్రాసినా అసమగ్రంగానే ఉంటుంది.

నవల్లో శైలి వాస్తవికం కాల్పనికం అని రెండు విధాలుగా విశ్లేషించవచ్చు. వాస్తవికం సహజమైన శైలికి, కాల్పనికం ఆలంకారికమైన శైలికీ దారితీసేది. సామాజికమైన అంతస్థులు, ప్రాంతీయమైన వ్యత్యాసాలు ప్రసక్తమైనపుడు, సహ జమైన శైలి సముచితం. ఎన్నో కృత్తులకు సంబం ధించిన ప్రత్యేకతల చిత్రణంలోనూ చూడవచ్చు. కాల్పనికం రచయిత కల్పనాశక్తిని ప్రదర్శించేది. వర్ణనల్లో ఎక్కువగా ప్రమేయాన్ని పొందుతుంది. ఇందులో ఆలంకారికతకూ ప్రాముఖ్యం అధికం. కొందరు రచయితలు ఈ నాటికీ ఆలంకారికమైన శైలిలో - గ్రాంథిక మర్యాదలతో వ్రాసే వారూ ఉండవచ్చు. ఇది నవలకు తగదు. నవల-మౌలిక మైన స్వరూప స్థితికి భంగమైంది.

శైలీ విభాగ (unit)మైన వాక్య నిర్మాణంలో సుదీర్ఘం, సంగ్రహం, మిశ్రమం అని మూడు విధాలు, కథనం, వివరణం, వర్ణనం ప్రత్యేక సంద

ర్భాల్లో దీర్ఘమైన వాక్యం, కలత, ఆవేదన, బాధ మొదలైన విపరీతమైన స్థితులూ, మనోభావాలు ప్రకటించేందుకూ, సంభాషణలోనూ వేగాన్ని సూచించేందుకు చిన్న వాక్యం; ఈ రెండిటి మిశ్రమం కథన స్థితీ, పాత్ర స్వభావం బట్టి ఉపయుక్తమౌతాయి. భాషాస్వరూపం, వాక్య విన్యాసం ఈ రెండూ శైలికి ప్రాథమికమైన విభాగాంగాలు కావడంవల్ల, మొత్తం మీద బాహ్యసౌందర్యాన్ని అనుభవంలోకి తెచ్చేందుకు మొదటి ప్రయత్నం వీటి వల్లనే కలుగుతుంది. ఇది ఇలా ఉంచి ఇందులో ధ్వని (sound)కి సంబంధించిన అంశమూ ఈ సందర్భంలో పేర్కొనవలసి ఉంది. వివిధ సందర్భాల్లో ధ్వని రీతులు (Patterns) వాక్య స్థాయిలో శైలిని ప్రభావోపేతం చేస్తాయి. నవల్లో లయానిత్వమైన రచనలో, ఒకే విధంగా ధ్వనించే శబ్దాలు, ఒక దాని తరువాత మరొకటి లేదా కొన్ని నియతమైన స్థానాల్లో ఉండే విధంగా పునరావృత్తం జరిగి (అనుప్రాసయుతమై) ఆలంకారిత సిద్ధిస్తుంది. ప్రత్యేకమైన శబ్ద గత ధ్వని రీతులచేత, లయాత్మకమైన విచిత్ర గతులచేత నిబిడమైన శిల్పమూ శైలీ నిర్మాణంలో భాగమే.

శైలి సహజ ధోరణితో పాటు కళాత్మకతనూ పొందిన నిర్మాణంచేతహృదయావర్జకంగా, సౌందర్యమయంగా విలసిస్తుంది. దానిలోని శిల్ప వివేచనకనుకూలంగా చేసే ఆలోచనకు సహేతుకమూ సముచితమూ అనిపించాలి. ఉత్తమ శైలి అనుభవ సమయంలో హేతువు విస్మృతమై లేదా హేతువుకతీతమైన స్థితి ఏర్పడుతుంది ఇది కవిత్వంలో కంటే నవల్లో విస్తృతమైన పరిధిలో పరచబడి కల్పన కంటే వాస్తవానికీ, జీవిత సత్యానికి దగ్గరగా ఉండటం వల్ల సాధారణ పాఠకులకెంతో సన్నిహితంగా ఉండి, సులభంగా అవగాహనకు రావడానికి వీలు. ఈ సమయంలో విశిష్టమైన శైలి పాఠకునిలో చదివింపజేసే శక్తినీ, చివరి దాకా అభిలాషను నిలపగలిగిన ఆకర్షణనూ సమాహిత పరుస్తుంది.

శబ్దాల సహయోగంవల్ల ఏర్పడే ధ్వనికి, వివిధ రీతులచేత పాఠకుని మానసికమైన ఆలోచనా ప్రవాహాన్ని నిలుపగల శక్తి ఉందని గుర్తిస్తే, ఈ ఆకర్షణ ఏలాంటిదో, తెలుస్తుంది. శబ్దయోజనం, వాక్య విన్యాసం రూపంలో, రచయిత వ్యక్తిత్వాన్ని ప్రత్యక్షంచేసే ఈ స్థితిని జాగ్రత్తగా పరిశీలిస్తే, రచన మొత్తం మీద ఆయా సందర్భాలను బట్టి కథనం (narration), వివరణం (explanation) వర్ణనం (description) సంభాషణ (Conversation)వాదం (argument) చర్చ (discussion) ఉపన్యాస (speech) ధోరణి రూపంలో బహుముఖాలుగా పొందు పరచబడి ఉంటుంది. ఇందులో ఒక్కొక్క విధమైన శిల్ప విధానం కలిగి ఉంటుంది. ఈ అంశం ఇక్కడ అప్రస్తుతం, అయితే ఒక్కమాట. ఇది మొత్తం మీద ఇతివృత్తం, పాత్రతో అను సంధితమై ఉంటుందని వేరే చెప్పె నక్కరలేదు. దీన్ని ఔచిత్యంతో సందర్భాన్ని బట్టి ఒక స్థాయిలో నిర్వహించగల రచయిత శైలీ నిర్మాణంలో ఉన్నత ప్రమాణాలను ఆవిష్కరిస్తాడు. మరో మాట, ఇది నవల్లో చక్కని హాస్యం, ఆనందం, విషాదం కరుణ మొదలైన మనోభావ సమర్పణమైన విన్యాసంచేత ఎంతో ప్రకాశిస్తుంది. జాగ్రత్తగా పరిశీలిస్తే శబ్దం-బాహ్య సౌందర్యంనుండి, భావం అంతర రామణీయకత వైపు, శైలి ప్రసారాన్ని పొందడం అనుభవానికి వస్తుంది. ఇది ముఖ్యం. ఇది విశిష్టమైన అనుభూతికెంతగా ఉపకరించేదీ, సహృదయలోకానికి సువిదితం.

కళ–శిల్పం పేరిట ఏలాంటి సందర్భంలోనూ సాధారణమైన సంభాషణలోని సహజత్వాన్నీ, అభివ్యక్తి విధానాన్నీ త్యాగం చేయకూడదు. అపుడే శైలి ఆ భాషా సౌందర్యాన్ని కలిగి ఉంటుంది. ఈ

పరిమితుల్లో విశేషమైన దృష్టితో కళాభావనలో అనుభూతి సాంద్రతను పెంపొందించే గుణంతో సంపన్నం కావచ్చు. దీన్ని సాధించడానికి భాషలోని నిసర్గమైన ఆధారం కావాలన్నదే ప్రస్తుతాంశం. ఆ తరువాతనే శిల్ప గతమైన విలువలకు ప్రాధాన్యం ఉండాలి గొప్ప రచయితలందరూ ఈ రెండిటినీ సందర్భోచితంగా ఎతో సామరస్య పూర్వకంగా సమన్వయ ధోరణితో ప్రయోజనాన్ని సాధించడం గమనించవచ్చు. ఇంత వరకూ తెలుగు వచనంలో లేని తీవ్రత, తీక్షత, వేగంతో విసరే వ్యవహారిక వాక్య విన్యాసంతో చలం రచనలు మన దృష్టికి రాక మానవు. ఇందులో భావ స్పందన ఎంత వేగంగా ప్రసరిస్తుందంటే, దానిలయను పాఠకుడు అందుకునే లోపల దూరం ప్రవహిస్తుంది. శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి రచనలు మూట గట్టిన తెలుగు భాషా సౌందర్యాన్ని-అనేకమైన మాటలు పలుకుబడి సామెతలు జాతీయాలతో మన ముందు ప్రదర్శిస్తాయి. వేయేండ్లుగా పరిణామాన్ని పొందిన తెలుగు కావ్యభాషలోని ప్రౌఢత్వాన్నీ, ప్రజల నాల్కలపై న ర్తించే పలుకులోని చేవనూ, అమూల్యమైన సంపదను భద్రపరచి, అందించే శైలీ నిర్మాణానికి విశ్వనాథ ప్రతినిధిగా కన్పిస్తాడు.

శైలి నవల్లో వస్తువును బట్టీ, రచయిత సంస్కారాన్ని బట్టీ అనేక రూపాలు పొందుతుంది. అయితే సహజత్వంలో వాస్తవికతకు దగ్గరగా, రామణీయకతలో కళాత్మకమైన స్థాయిని పెంచేదిగా ఉండటంలోనే విశిష్టమైన ప్రమాణాలను సాధిస్తుంది. భాషా గౌరవానికి దోహదం చేస్తుంది ఒక రచనను మరో రచనతో పోల్చి చూడడంలో మొదట మన దృష్టికి వచ్చేది శైలి. నవల ఆరంభించగానే ప్రభావం నెరిపే, అంశాల్లో "వాతావరణం"తో పాటు శైలి ఒకటి. శైలి రచయిత వ్యక్తిత్వాన్ని బట్టి నిర్వహణలోని శిల్పాన్ని బట్టి, రూపొందుతుంది. రచనలో శిల్పబంధురమైన శైలీ విన్యాసం కళాత్మకమైన విలువల్ని పెంచుతుంది.

ఇది సృజన శక్తిలోని స్వతంత్ర గుణాన్నీ నవతా స్థితినీ, స్పందన శీలాన్నీ భావింపజేస్తుంది, ఈ విధంగా వివేచిస్తూ పోతే, వ్యక్తుల్ని బట్టి వ్యక్తిత్వాలెన్ని విధాలో, రచయితలను బట్టి శైలి అన్ని విధాలన్న అభిప్రాయంలోని ఔచిత్యం, స్ఫూర్తికి వస్తుంది.

—o—

రీడర్
కాకతీయ విశ్వవిద్యాలయం,
వరంగల్

# కడప జిల్లాలోని కొన్ని మాండలికములు

-జె. విజయలక్ష్మి ఎం. ఏ., బి. ఇడి.

మాండలికము అనగా మండల సంబంధమైనదని చెప్పబడినది దానిని బట్టి ఒక ప్రాంతంలో వ్యవహరింబ బడే భాషను, ఆ ప్రాంతపు మాండలిక మంటారు. కొన్ని భాషల కనేక మాండలికాలుంటాయి. మన తెలుగు భాషకు ప్రధానమైనవి నాలుగు మాండలికాలు. అందులో రాయలసీమ మాండలికంలో అతి ప్రాచీన కాలంనుండి వాడుకలోనున్న పదాలు ఎక్కువ మార్పు పొందకుండా వున్నాయి. ఈ మాండలికముపై సంస్కృత ప్రభావం తక్కువ అని నిరూపింప బడినది.

కడపజిల్లా ఈ మాండలికము క్రిందనే వస్తుంది కడపజిల్లా మాండలికంపై కన్నడ భాషా ప్రభావం కన్పిస్తుంది. ఈ జిల్లాలో వ్యవహారంలో నున్న కొన్ని ప్రత్యేక పదాలను పరిశీలిద్దాం.

1. మెట్టు-చెప్పు.

మెట్టు అనగా సోపానమని ఎక్కువ వాడుకలో వుంది. కానీ కడపజిల్లాలో మాత్రము చెప్పుఅని వ్యవహరిస్తారు. "వాడిని మెట్టెతో కొట్టాలి"

2. పొరక —చీపురు

"ఇల్లంతా పొరకతో శుభ్రంగా తొయ్యి."

3. బేడలు —పప్పులు.

'బేడ' అను పదము ఒకప్పుడు రూపాయిలో ఎనిమిదవవంతు నాణానికి వ్యవహారంలో నున్న పదము.

కడప జిల్లాలో ఏ పప్పుకయినా సాధారణంగా బేడలు అంటారు.

"కంది బేడెలు బాగుచెయ్యి"

4. ఉద్దిపప్పు— మినప పప్పు.

'ఉద్దిపప్పు వడలు పండుగకి చెయ్యాలి'

ఈ పదము చిత్తూరు జిల్లాలో కూడా వాడుకలో వుంది.

5. ఊరుబిండి— పచ్చడి.

"రాత్రి అన్నంలోకి ఏదైనా ఊరుబిండి చెయ్యి"

6. గేగులు— తేగలు.

'లేత గేగులు బాగా జీర్ణమవుతాయి'

తాటిపండును భూమిలో పాతితే వచ్చే మొనలను తేగలు అంటారు ఇవి చాలాప్రాంతాల్లో దుంపల్లాగ ఉడికించి తింటారు.

7 పోళీలు— బొబ్బట్లు.

'పోళీలు చాలారుచిగా ఉంటాయి.

ఇది హొళిగలు అను కన్నడ పదమునుండి తెలుగులోనికి వచ్చినది.

8. సుఖీలు— బూరెలు.

'వినాయక చవితికి సుఖీలు తప్పక చెయ్యాలి'

ఈపదం నెల్లూరు జిల్లాలో కూడ వ్యవహారంలో వున్నది.

9. దోసెరేకు — పెనము.

దోసెకాల్చే పెనమును దోసెరేకు అంటారు.

'దోసెరేకు బాగా కాలనియ్యి.'

10. అన్నంగుత్తి — అన్నం వడ్డించుకునే గరిట.

'అన్నంగుత్తి ఇట్లా తీసుకురా'.

దీనినే కొన్నిప్రాంతాల్లో హస్తం అని కూడా అంటారు.

11. లొడిగ— గరాటు.

'నూనె లొడిగలోనుంచి నెమ్మదిగా పొయ్యి'.

12. తట్ట— కంచము.

'తట్టలో అన్నంపెట్టు'.

అన్నంతినే కంచాన్ని, సన్నఅంచుతో వుండే పళ్ళాన్నికూడా తట్ట అనే అంటారు.

13 చిత్త— సంచి.

"చిత్తలో డబ్బులున్నాయి".

14. గోసు పువ్వు— కాబేజి.

'ఇవాళ గోసుపువ్వుకూర చెయ్యి.

15. గోగాకు— గోంగూర.

"గోగాకు పచ్చడి చెయ్యి.'

నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో కూడ ఈ పదమే వాడుకలో వుంది.

16. పుల్ల— కుంకుడు పులుసు.

'తలకు పుల్లపొయ్యి.'

'పుల్ల' అంటే పులుపు అని, క్రముక్క అని మిగతా ప్రాంతాల్లో వాడుకలో వుంది.

17. కడుగు— కుడితి.

'పశువులకు కడుగు పెట్టు'.

'కడుగు' అంటే కడుగుట అను క్రియారూపమే ఎక్కువగా వ్యవహారంలో నున్నది. కొన్ని ప్రాంతము లలో మాత్రము బియ్యము కడిగిన నీటిని 'కడుగు' అంటారు. బియ్యం కడిగిన నీళ్ళుకూడా పశువులకు పెట్టటం వలన, వాటికి త్రాగటానికి పెట్టే ద్రవపదార్థా లన్నింటిని కూడా 'కడుగు' అనటం వాడుకలోకి వచ్చి వుంటుంది.

18. ఎనుము— గేదె

"మా ఎనుము ఎక్కువ పాలిస్తుంది.'

19. నవ— దురద

ఆ కుక్క ఒళ్ళంతా నవతో కాళ్ళతో గోక్కుం టున్నది".

'నవ్వ' అని కూడా వాడుక గలదు.

20. లెక్కాచారము— లెక్క, జమాఖర్చు.

"నిన్న అయిన ఖర్చంతా లెక్కాచారం చూడు'

21. మడివలి — చాకలి.

'బట్టలన్నీ మడివలికి వెయ్యి'.

22. అబ్బ— బిడ్డ.

"మన అబ్బ బాగా చదువుతున్నాడు'.

23. అమ్మయ్య — టీచర్.

'సరోజినీ అమ్మయ్య పాఠాలు బాగా చెప్తారు'.

లేడిటీచర్ని మాత్రమే 'అమ్మయ్య' అంటారు.

24. జంపర్ — జాకెట్.

'నాలుగు జంపర్లు కనిపించలేదు'.

పైవిధముగా కడపజిల్లాలో వ్యవహారములో నున్న కొన్ని మాండలికములను మాత్రము ప్రస్తావించుట జరిగినది. మాండలికముపై గల కన్నడ ప్రభావము, పరిశోధకులు పరిశీలించ తగినది.

6-19, 2 బి
ఈస్ట్‌పాయింట్ కాలనీ
విశాఖపట్టణం-3

# చలన (వి)చిత్ర జీవితాలకు దర్పణం
# భరద్వాజగారి 'పాకుడు రాళ్ళు'

-శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి

"సాహిత్యం సమాజానికి దర్పణం" అని నిర్వచించారు పెద్దలు. అసలు "సమాజం" అంటే ఏమిటి? "ఎక్కడున్నావే గొంగళీ అంటె వేసిన చోటనే వున్నాను" అనేది సమాజం కాదు. ఊపిరి తిరగని సమస్యలతో ఎవరో ముందుకు తోస్తున్నట్లుగా పరుగులు పెట్టేది "సమాజం". అనగా ముందుకు-అదీ ప్రగతి వైపుకు పరుగులు పెట్టేదే సమాజం అల్లాంటి సమాజాన్ని ప్రతిబింబింప చేసేదే అసలైన, సిసలైన సాహిత్యం.

...

సమాజానికి వ్యక్తి ముఖ్యం. ఆ వ్యక్తికి వ్యక్తిత్వం ముఖ్యం. జీవించటం తెలిసినవాడు వ్యక్తి అయితే, ఆ జీవించటం వ్యక్తిత్వం. జీవితం సుఖ దుఃఖాల మయం. మనిషి జీవితంలోకి అవి ఎల్లా వస్తున్నాయి? అవి వచ్చినప్పుడు ఆ మనిషిలోని స్పందనలు ఎల్లా వుంటాయి? మనో విశ్లేషణను ప్రతిబింబింప చేసేదే నిజమైన సాహిత్యం. అయితే కవిత, కథానిక, కథ, నవల, నాటిక, నాటకం మొదలైనవన్నీ కూడ సాహిత్యంలోని శాఖలే. వీటిలో ఏ ప్రక్రియ చేపట్టినా దాన్ని "మానవతా" దృక్పథంతో "సమర్థవంతంగా" రూపొందించటం జరిగినప్పుడే అది ఉత్తమ సాహిత్యం అవుతుంది. అదే పది కాలాల పాటు నిలుస్తుంది ఆ సాహిత్యమే ముందు తరాలకు మార్గదర్శక మవుతుంది కూడాను.

ఈ సత్యాన్ని డాక్టర్ డి. పి. ముఖర్జీగారు తమ "Modern Indian Culture" అన్న గ్రంథంలో ఇలా వివరించారు.

"The Scope of subject for Novels, stories and Poems has been considerably enlarged It is now far away from mere social reforms.....The life of the unfortunate men and women in the cities...have crept in, while class consioness has also been indicated and stressed. In a word, Socia conflict is the modern literary theme.

కాబట్టి సామాజిక దృక్పథంలేని రచనలు ఉత్తమ సాహిత్యంగా పరిగణింప బడవు. ఉత్తమ సాహిత్యంలో ఎప్పుడూ మనుషులు-వాళ్ల సమస్యలు సంఘర్షణలు-ఉండాలి.

....It is one of the essential criteria of the true literature that it expose it self to the reality of the here and now with all its problems, and does not with draw into the ivory tower of an artistic existence...[2]

అన్నట్లుగా ఉత్తమ సాహిత్యం వుండాలి. స్వాతంత్ర్యా నంతరం బాగా వ్యాప్తిలోకి వచ్చిన సాహితీ ప్రక్రియలు-కథ, నవల. అందునా నవలలు మరింత ప్రాచుర్యం సంపాదించుకున్నయి. నవల కనుగుణమైన వచనం వ్రాయటం కూడా సులభమైనపని కాదు. దానికీ ప్రతిభ అవసరం. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి". అల్లాంటి ప్రతిభతో వ్రాసిన గద్యమే

నవలకు ప్రాణం. "గద్యం కవీనాం నికషం వదంతి." అన్నది ఆర్యోక్తి.

ప్రతిభ, ప్రతిభతో రచించిన గద్యం, మనోవిశ్లేషణ, మానవతా దృక్పథంతో చూసిన సమాజం, ఆ చూసిన సమాజాన్ని సాహితీ దర్పణంలో ప్రతిబింబింప చేయగల నేర్పుగల, రచయితలు తెలుగులో సంఖ్యాపరంగా తక్కువే అయినా గణనీయమైన వారున్నారు.

రచయిత తాను సృష్టించిన పాత్రలో నుండి మనకు నిత్యమూ దర్శిత మవుతూనే వుంటాడు. అయితే ప్రతి పాత్రలోనూ రచయిత కనబడుతూ వుంటాడు. కాబట్టి ఏ ఒక్క పాత్రనో చూస్తే రచయిత రూపం స్పష్టంగా కనబడదు. అందువల్ల జీవంతో తొణికిసలాడుతున్న ఆ పాత్రలన్నింటిని దర్శించాలి. అలా దర్శించినప్పుడుగాని రచయిత యొక్క పూర్ణస్వరూపం మనకు గోచరించదు. అల్లాంటి పాత్రలు గల నవలలే కాలంతో పాటు నిలబడగలవు. అల్లా నిలబడగలిగే నవలల్లో "పాకుడురాళ్ళు" గణనీయమైనది. ఇందులోని అనేక పాత్రల ద్వారా రూపం-ప్రతిభ, మానవతా దృక్పథం, యథార్థ చిత్రణ మొదలైన రంగులతో రచయిత రూపం మనకు కనబడుతుంది. నేను చూసిన భరద్వాజ గారి ఈ రంగుల చిత్రాన్ని మీ ముందుంచుతున్నాను.

"పాకుడు రాళ్ళు" నవలలో ఆద్యంతం కనబడేది "మంజరి"గా కీర్తి శిఖరాలనందుకున్న "మంగమ్మ" ఈ మంగమ్మ పుట్టింది-నాటకాలలో ఆడ పాత్రలను కూడా మగవాళ్ళే వేస్తున్న రోజుల్లోంచి - ఆడ పాత్రలను ఆడవారిచే వేయించాలన్న రోజుల్లోకి నాటక రంగం మారుతున్న సంధికాలంలో - నాటి తెలుగు ప్రేక్షక జనానికి పరిచయం కాబడింది; రామచంద్రం అన్న పాత్రద్వారా. అప్పటి ఆమె ప్రాయం పదిహేను పదహారేళ్ళు. "చూడ్డానికి బాగానే వుంది". అనిపించే రూపం. ఈ రూపం చిత్రకారుడు రంగులు దిద్దటానికి ముందు వేసుకున్న 'స్కెచ్' లాంటిది. స్పష్టా స్పష్టంగా కనబడేది. మంగమ్మ తెలుగువారికి పరిచయమయ్యే నాటికి - తనకేమవుతుందో తెలియక పోయినా, తనకు తల్లినని చెప్పుకుంటున్న నాగమణి లాంటి వేశ్యకుటిల నీతి నీడల క్రింద పెరుగుతున్న మట్టి బొమ్మ.

మనస్సును - ఆ మనస్సు స్పందించే తీరును - ఆ స్పందనలో నుండి ఆవిర్భవించిన వ్యక్తిత్వాన్ని ఫోటో తీయగల నేర్పుకు, ఆ ఫోటోను 'కలర్'లో ప్రదర్శించగల భరద్వాజగారి కళానైపుణ్యానికి మంగమ్మ-ఒక ఉదాహరణం.

అసలు ప్రారంభం "ప్రజావిజయం", నాటకంతో అయింది. ఈ విజయం దేనిలో సాధించినట్లు-ఆడ పాత్రలను ఆడవారిచేత వేయించటంలో, పౌరాణిక ఇతి వృత్తాలుగల నాటకాల నుండి సాంఘిక ప్రయోజనాలు గల ఇతి వృత్తాలున్న నాటకాలను ప్రదర్శించటంలో-వేశ్యనైనా వెలివేయకుండా సంఘంలో మర్యాద కల్పించటంలో....అని అనేక విధాలుగా మన కళ్ళ ముందు ఈ ''ప్రజావిజయం" అన్న పదాలు కదలాడుతాయి. దీన్నే నన్నయ "ప్రసన్నకథ'' అన్నది. అయితే ఈ ప్రసన్నకథ "లోనరసినగాని" సుబోధకంగాదు. "...డబ్బే ప్రధానం. డబ్బుకోసం ఏం చేయడానికైనా రెడియే ..." అన్న స్వభావంగల వ్యక్తి నీడల్లో జీవితం వెళ్ళబుచ్చటం లాంటి దుర్భర స్థితికి మొదటి స్కెచ్‌లో మంగమ్మను చిత్రించారు. భరద్వాజ. ఆ స్థితి యొక్క స్థితిగతులు మన మనఃఫలకం మీద అల్లాగే అచ్చుపడిపోతాయి. "పస" కన్న 'ప్రచారం' ఎక్కువ ఉండడం వల్ల, కలిగే ప్రయోజనం ఏమిటో అనుభవంలోకి తీసుకువచ్చిన నవల పాకుడు రాళ్ళు. ఇక్కడ 'కావ్యార్థసూచన' ఉంది. ముందు ముందు మంగమ్మ.... మంజరిగా మారి- మంజరిగానే కీర్తి శిఖరాల నధిరోహించటానికి పనికి వచ్చిన రాళ్ళు 'పాకుడు రాళ్ళు" కావు. "ప్రచారపురాళ్ళు" అన్న రామన్న కథావస్తువు ఇక్కడే మనకు స్ఫురిస్తుంది. ఇట్టి రచనలు ప్రతిభావంతుడు, లోకజ్ఞుడు మాత్రమే

చేయగలదు. మనిషి ఎంత ఎదిగినా- ఒక స్థాయివరకే ఆ తరువాత ఎదగటానికి అవకాశం వుండదు. అవరణకూడా ఉండదు ఆ స్థాయిలోనే చిరస్థాయిగా నిలిచిపోవటమో, లేక అక్కడనుండి క్రిందికి జారడమో తప్పమరో మార్గంలేదు. జారిపోవడం చాలా తేలిక. ఆ జారటంకూడ పాతకుడు రాక్షైతే మరింత త్వరగా జరిగిపోతుంది. ఈత్వరితగతిని జారిపోటానికి నేపథ్యసంగీతం "పాకుడురాళ్ళు" శబ్దం, ఈ "పెరో బలా" స్టేట్ భరద్వాజగారు చిత్రిస్తున్న చిత్రానికి కాన్వాస్ లాంటిది.

జీవితంలో నాటకం ఆడటమే ఒక పెద్ద నటన అంటున్నప్పటి మంగమ్మ రూపం ముగ్ధల్ని చేసేటట్లు వుంటుంది. అంతకన్న ఎక్కువ చెప్పకుండా మంగమ్మ ముగ్ధమోహనమైన రూపాన్ని చిత్రిస్తారు రచయిత. విప్లవంకోసం "ప్రజావిజయం" సాధించిన మరోమెట్టు "మళ్ళీపెళ్ళి" త్రిరేశలింగంగారి ఆశయాలు ప్రజల దగ్గరకు వెళ్ళాయి "మళ్ళీపెళ్ళి" నాటకంతో.

ఎంత నటులైనా.... "సాంగత్యం సాప్తపదీనం" అన్నట్లుగా కొంతకాలం కలిసి వుంటే...ఒక విధమైన అప్యాయత, అనురాగం ఏర్పడతాయి. వీటి రంగుల చిత్రణకు భరద్వాజగారు ఎన్నుకున్న భూమిక అద్వితీయం.

కథావస్తువుకు ప్రాణమైన మంగమ్మను ఒంటిగా- ముందు ఆధారం దొరికేవరకు కాలం గడవటం కోసం కొంత పైకంతో- ఆ పైన ఆధారంకోసం ప్రయత్నించటమా లేక పాత జీవితం పైన ఆధారపడటమాఅన్న సందిగ్ధంలో- వదిలి ఎవరి దారిన వారు వెళ్ళారు.

ఏదారీ తెలియని మంగమ్మను వెతుక్కుంటూ వచ్చాడు చలపతి. చలపతిది ఒక విచిత్రమైన వ్యక్తిత్వం కొంతమంది తమ తెలివితేటల వల్ల తామే బాగుపడతారు తప్ప ఎదుటి వారి కేమాత్రం ఉపయోగపడరు కొంతమంది తెలివితేటలు తమకంటె- ఎదుటివారికే ఎక్కువ ఉపయోగపడతాయి. ఈ మొదటి కోవకు చెందినవాడు చలపతి 'ఆకుకు అందని-పోకకు పొందని మాటల్తో- ఏం చెప్తున్నాడో తెలియక పోయినా ఎదుటివాణ్ణి ముగ్ధుణ్ణి చేయగల నేర్పు' ఈ చలపతికి పుష్కలంగా వుంది.

తాను బాగుపడటం కోసం ఓ పెద్ద ప్రయత్నం సఫలం కావాలంటే పదిమంది సహకారం కావాలంటారే 'ముఖ్యంగా నీలాంటివారు గట్టిగా పూనుకోవాలి...' అంటూ మంగమ్మను తన పరిధిలోకి మెల్లిమెల్లిగా ఆకర్షిస్తాడు. మాటలతో గారడీ చేయడంలో చలపతి అందె వేసిన చెయ్యి. ఒకపక్క అందలం ఎక్కిస్తూనే మరోపక్క ఎందుకైనా మంచిదని గోడమీది పిల్లివాటంగా ప్రవర్తిస్తాడు. "నేనయినా నీకు పెద్ద పెద్ద ఆశలేమీ చూపించటంలేదు....మంగమ్మా..." అంటూ చలపతి, మంగమ్మను తనతో మద్రాసు వచ్చి సినిమాల్లో నటించటానికి వప్పుకునేటట్లు చేస్తాడు-కాస్త వ్యవధిలోనే జీవితాన్ని కాచి వడబోసిన వాడిలాగ తన నేర్పరితనాన్ని వ్యక్తం చేస్తాడు. "ఇక్కడ నీకేమన్న కమిట్‌మెంట్స్ ఉన్నయ్యా...." అన్న చలపతి మాటలకు మంగమ్మ పెదవి విరుస్తుంది. Situationని capitalise చేసుకోవటం అందరికీ చేతకాదు. అది బ్రతకటం నేర్చిన కొందరికిమాత్రమే అబ్బే అదృష్టం. అందుకే పెదవి విరిచిన మంగమ్మను "ఈపోజులో రెండు క్లోజప్‌లిస్తే జనం విరగబడి చస్తారనుకో మంగమ్మా! నీది బ్రహ్మాండమైన ఫోటోజెనిక్ ఫేస్... నువ్వు సినిమాల్లో రాణించకపోవటమంటూ...జరగదు అంటూ తనవైపు మరింత ఆకర్షించుకుంటాడు "అట్లా రాణించకపోతే అది నీతప్పుకాదు-ఆ సినిమాలోకంలోనే లోపం వుందన్న...." భావం ఆమెలో కలిగిస్తాడు. చిన్నదైనా-చాలినంత అనుభవంగడించుకున్నదనటంవలన-ఎంత ఉబ్బేసినా...మంగమ్మ ఎగిరి గంతేయకుండా "నన్నింకా ఆలోచించుకోనివ్వండి అంటుంది. అంతమాత్రానికి ఓడిపోయే రకంకాదు చలపతి ఈ ఛాన్సు వదులుకుంటే మళ్ళా ఇల్లాంటి అవకాశం రాదంటాడు. Oppertunity knocks lInd

only once in the life and we have to away he oppertunity is fince and correctly.

చివరి అస్త్రంగ "డబ్బుకావాలా?" అని అడిగి – "కావాలంటే మాత్రం మీరిస్తారా..." అన్న మంగమ్మకు నాలుగు వందల నోట్లు ఇచ్చి...ఆ ఇవ్వటంలో తన దగ్గరిల్లాంటి నోట్లు ఇంకా చాలా వున్నయన్న విషయాన్ని ఆమెకు తెలియజేస్తూ-మరో మాటకు-తావివ్వకుండా పోతాడు. మంగమ్మ మడిచి సంచిలో దాచుకుంది. అంటే తాను చలపతితో మద్రాసు సినిమాల్లో నటించటానికి వెళ్ళాలని నిశ్చయించుకున్న దన్నమాట.

తనవాళ్ళనందర్నీ మరోసారి కళ్ళ నిండుగా చూసుకొని, గాలిలో తేలిపోతున్న శరీరంతో మద్రాసు చేరిన మంగమ్మను. అక్కడి భవనాలు, కార్లు ఫ్యాషన్లు ఆశ్చర్య పరిచినాయి.

ఊహాలోకంలోంచి - పూల మొక్కల మధ్య అందమైన భవంతి - అభవంతి ముందు నిలబడ్డ ఓ అందమైన కారు - ఆకారు డ్రైవరు తన కోసం డోరు తెరిచిపట్టుకుంటె ఎక్కుదామనకున్న తాను-కొడంబాకంలోని స్ట్రీట్‌లో 192 ఇంటి ముందు ఇగగానే Utters disappointment పొందింది. అయితే ఆ disappointmentను "లోలోపలే భద్రంగా దాచుకుంది." చలపతి మంగమ్మ నుద్దేశించి "ప్రస్తుతానికి మన ఇల్లు ఇదే." అన్నాడు. ఇక్కడ "భద్రంగా తలదాచుకుంటు - ప్రస్తుతానికి..." అన్న శబ్దాలు ఆగామి కథా సంవిధాన సూచకాలు. ఇదే కావ్యార్థ సూచన.

ఈ విధంగా మంగమ్మ మద్రాసులో తన సినిమా జీవితం ప్రారంభించింది. అప్పటి ఆమెకు సిటీ అంతా చూసి వచ్చేసరికి "ఊరంటే ఇదే పూర్తు-బ్రతుకంటె ఇదే బ్రతుకు...." అనిపించింది.

చలపతి మీద ఆధారపడిన తన జీవితాన్ని-త్వర పడి పాడు చేసుకోవటం ఇష్టంలేక-రాజామణి అనుభవాలను తనకు మార్గ దర్శకంగా వాడుకోగలిగి-సోపాన మార్గంలోని మొదటి సోపానం మీద కాలు పెట్ట గలిగింది. తనని అమాయకురాలనుకునే వాళ్ళ అమయాకత్వాన్ని అంచనా కట్టటమే గాకుండా ఆ అమాయకతను, తనంటే పడి చచ్చే ప్రలోభాన్ని encash చేసుకోగల స్తోమతతోనే చలపతితో మద్రాసులో అడుగుపెట్టింది. అదే ఆమెకు శ్రీరామరక్ష. "నవ రత్నాలన్నీ ఒకచోట - నక్షత్రగుల్ల లన్నీ ఒక చోట చేరతా" యన్నట్లు... సినిమాల్లో నటించాలని మోస పోయి వచ్చి అయిదుకి పదికి అవస్థపడుతూ, చలపతి దగ్గర పని మనిషిగా కుదిరిన తాయారు-తన అనుభవాలను విప్పి చెప్తూ-మంగమ్మకు సినిమా జీవితంలోని తొలిపుటల్ని చదివి వినిపించింది.

అందరికీ వున్నట్టే చలపతికి జాతకాల్లోనూ, సినిమాలో నటించటానికి వచ్చే వారి పేర్ల విషయంలోనూ నమ్మకం వుంది. ఉన్నదో లేదో కాని....మంగమ్మకు నమ్మకం కలిగించాల్సిన అవసరం చలపతికి వుంది. ఆ అవసరం ఫలితమే చలపతి "ముసలి వేషాలకయితే బాగా పనికొస్తాడు..." అన్న ఓ ఆకారం "మా గొప్ప చెయ్యిలే...మాట అన్నాడంటే జరిగితీరవలసిందే... దానికి తిరుగులేదు." అన్న చలపతి ఇచ్చిన కితాబు పుచ్చుకున్న ఓ జ్యోతి షచక్రవర్తి మంగమ్మ భావిని చెప్పటానికి వచ్చింది. పొట్ట కూటికి. తాళపత్ర గ్రంథాలు తిరిగేస్తూ కాస్త అటూ-ఇటూగా అందరి భవిష్యత్తూ ఉజ్వలంగా వుంటుందని చెప్పే అనేక మంది చిలక జోస్యుల్లాగానే ఈ పరబ్రహ్మశాస్త్రిగారు కూడా, ఒక శుభముహూర్తాన-మొరటుగా వున్న "మంగమ్మ" పేరును "మంజరి"గా మార్చి సినిమాటిక్ చేశారు.

"ప్రతి సంఘటనకూ ఏదో కారణం ఉంటుందన్న మాట నిజమే గ్గానీ, అన్నిటికీ సరైన కారణాలను మనం చెప్పుకోగలమా? ఎన్నటికీ కాదు. అలా మనం కారణాలు-మనకు నచ్చిన కారణాలను చెప్పుకోలేక

పోయినప్పుడే - విధి ప్రసక్తి వస్తుంది." ఇది జీవితం కాచివడబోసి అన్నమాట అందుకే కాబోలు డాక్టర్ ముదిగొండ శివప్రసాద్‌గారు ఈ రసస్రష్టను గురించి "మానవ జీవితపు లోతులను తరచి చూచిన దర్శనాలు. మనిషి ఎంత నీచుడౌతాడో, పరిస్థితులకు అవసరాలకు ఎంత బానిస అవుతాడో, సంకల్పిస్తే శూన్యం నుండి సృష్టి చేయగలుగుతాడో..." అని అంటారు.

సినిమా ప్రపంచంలోని అందరి జీవితాల్లాంటిదే మంజరి జీవితం కూడాను. కథ అందరికీ తెలిసిందే. అయినా ముందుకు తోసుకుపోతూ ఉత్కంఠతతో చదివించే నేర్పుతో చేసినదీ రస సృష్టి. ఈ రసపుష్టిని గురించి విశ్వనాథ వారి మాటలు ఇక్కడ స్మరణీయాలు ''ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవకథా ధృతిని మించి ..''

చలపతి మంజరిని గురించి అన్ని కంపెనీల దగ్గరా కాన్వాస్ ప్రారంభించాడు. అసలు చలపతి అన్న వ్యక్తి-వ్యక్తిగా కాక-సినిమా లోకంలో పైకి రావాలన్నా-వచ్చి కాలూని నిలబడాలన్నా-ఏమేం చెయ్యాలి అన్న అనేక chemical mactias యొక్క మనిషి రూపం-అనిపిస్తాడు. ఈ సృష్టి ఒక్క ''కవి"మాత్రమే చెయ్యగలడు. కవి అంటే 'క్రాంతి దర్శి అయినవాడు మాత్రమే' అని వేరే చెప్పనక్కర లేదు. మనిషిలో ఒరిపిడి-ఆ రాపిడి లోలోనికి పోతే వేదాంతి అవుతాడు. అల్లా కాక ఆరాపిడి బహిర్గతం అయితే-మహాకావ్యం అవుతుంది. ఈ సాగర మథనాన్ని బహిర్గతం చేసి ఒక వచన మహాకావ్యం సృష్టించారు భరద్వాజ.

మంజరి--పురోగమనానికి మొదటి వాయిదాగా పత్రికా గోష్టిని అరేంజి చేశాడు చలపతి. ఎవరి అవసరం ఎప్పుడు ఎంతవరకు పొందాలో తెలిసి, అలా పొందగలిగిన నేర్పు కలిగినవాడు చలపతి. అందుకే పత్రికా గోష్ఠి! అసలు జర్నలిస్టులు ఎల్లాంటి వారంటే- "కూడ బలుక్కుని ఒక్క మాట మీద నిలబడితే ఆకాశాన పోయే దేవుడైనా దిగిరావల్సిందే..." అన్నంతటి బుద్ధి బలము, సంఘబలము గల వాళ్ళు. దురదృష్ట వశాత్తు తమ సంఘటిత శక్తి తమకు తెలిసినప్పటికీ, అల్లా ఒక్క మాట మీద నిలబడనివారు అందువల్ల వాళ్ళు సాధించగలిగిందీ అంతంత మాత్రమే అయింది!

అంతటి బలగం జర్నలిస్టుల గోష్ఠిని ఏర్పాటు చేసి మంజరిని హెచ్చరిస్తాడు. ''వాళ్ళతో చనువుగా వుండటం అవసరం'' అంటూ శబ్దశక్తి భరద్వాజకు తెలిసినంతగా చాలా కొద్ది మంది రచయితలకు మాత్రమే తెలుసు ఈ"చనువు" అన్న శబ్దం అల్లాంటి మహత్తరమైన శక్తిగలది పది మంది జేరితే ఆత్మ స్తుతికి మొదటి స్థానం లభిస్తుంది. అల్లాగే జర్నలిస్టులు ఎవరెవరు ఎవరెవర్ని తారా పథంలోకి తీసుకు వెళ్ళిందీ లిస్టు చదువుతున్నారు. ఎవరికివారు తాము చెప్పదలచుకున్నది చెప్పుకు పోతున్నారే తప్ప ఎదుటివారు ఏం చెప్తున్నదీ వింటున్నవారు కనిపించలేదు. అంతే కాకుండా-వారిలో వారికి - హీరో హీరోయన్లను బట్టి పార్టీలు.

అంతటి గజిబిజిలో చలపతి వాళ్ళకి ఓ చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. అతని మాట్లలో ''స్టూ" దొరికిన ఓ కుర్ర జర్నలిస్టు "ఈ ఫీల్డులో పైకి రావాలంటే .. వొళ్లయిజివెగ్ నేచర్...ఉండాల"న్నాడు. అతని చేతిలో "కొరడా" వుంది.

రాజకీయవాది అయినా పైకిరావాలంటే Devideand reele Policy బాగా తెలిసుండాలి. ఈ విద్యలో ఆరితేరిన చలపతి అప్పటికి ఉన్నత స్థానంలో వున్న ఇద్దరి హీరోలను విడివిడిగా కలసి-మంజరికి ప్రోత్సాహం ఇవ్వవలసిందిగా కోరాడు.

కప్పదాట్లు వేసుకుంటూ- సాంకేతిక నిపుణుల అవసరాలు తీరుస్తూ మంజరి... చాలా ముందుకు, అనుకున్న దానికంటె వడిగా నడిచింది. దీనికి కారణం మంజరి జాణతనం, చలపతి బలహీనత. "అది కాదమ్మడూ!. నీకు లోకానుభవం లేదు. చెప్పినా

నీకర్థం కాదు. నిన్నోస్థారుని చేపిందాకా నాకు నిద్రా హారాలు ఇమడవు." అంటూ ఇతరుల బలహీనతను encash చేసుకోగల చలపతి- ఎదుటి వారిని సరిగా అంచనా వేసుకోలేం తన బలహీనతను ఎదుటివారు తమ స్వార్థంకోసం వుపయోగించుకొనే విధంగా అవ కాశం ఇచ్చేస్తాడు. ఈ మాటలు అన్న చలపతిని "ఎంత మంచివారండి మీరు..." అన్నది మంజరి— దాదాపు పరవశత్వం చెందిన ధోరణిలో అలా అని, చలపతి వెళ్ళిన వెనక- 'ఈ దెబ్బతో చలపతి చిత్తయి పోవాలి ..' అనుకుంటుంది. నిజంగానే చలపతి చిత్తయిపోయాడు. పోయాడు కనకనే పత్రికల వాళ్ళతో నేస్తం కలుపుతూనే... అటు లాబీ వర్గా లతో కూడా చేతులు కలిపాడు చలపతి,

మంజరి అధిరోహణ కుపయోగపడిన మరో పాకుడురాయి "శర్మ" అతని పత్రిక "కొరడా". ఈ శర్మ తన కొరడా ఝళిపింపులతోనే పని పూర్తి చేసు కుంటాడు. అసలా ఆయుధం చేతులో వున్నంతసేపూ శర్మ గొప్ప వీరుడు. అది అతనికి 'జేబులో ఓబొమ్మ జేజేల బొమ్మ..! అందుకే అతను మంజరిని ఆకాశాని కెత్తేస్తూ ఒక వ్యాసం-నేలకేసి కొడ్తూ మరోవ్యాసం రాసుకువచ్చాడు ఈ రెండింటిలో మొదటిది ప్రచురణ పొందాలంటే ప్రెస్‌బిల్ మంజరి చెల్లించుకోవాలి. రెండోది వెయ్యాలంటే ఫ్రీ. అయితే ఇల్లాంటి పరి స్థితుల్లో-ఇక్కడ ఏ విధంగానైనా పైకి రావాలనుకునే వాళ్ళలాగానే- వీళ్ళ మనస్థితి చేతనారహితం అయి పోయింది. మొదటిది వేయడానికి డబ్బు కావల్సిన ప్పుడు- రెండోది ప్రచురించడానికి ఫ్రీగా ఎలా సాధ్యం అవుతుంది? ప్రెస్‌కు రెండూ ఒకటే ఈ ఆలోచనరాదు. అందుకే శర్మ 24 గంటల టైములో రూ. 500/- కావాలని అల్టిమేటం ఇచ్చివెళ్ళగానే "ఏమిటండీ గొడవంతా" అటుంది- మంజరి ఇక ఈ గొడవలోంచి బైటపడాలంటే- చలపతి ఇలా ప్లాన్ వేస్తాడు. "తాయారును పంపించెయ్యి... మనింటి కొచ్చేవారు మనక్షేమం కోరేవారేకదా,.. వారితో కలుపుగోరుతనంగా ఉండడంలో తప్పేమీలేదు. . తాయారును పంపించడం మరిచిపోకు.' అంటూ వెళ్ళి పోతాడు.

ఇక్కడ మళ్ళీ భరద్వాజగారి "శబ్దశక్తి",- "ప్రసన్న కథా కవితార్థ యుక్తి"- "కావ్యార్థసూచన ద్యోతకం అవుతాయి.

ఆలోచనల్లో మునిగివున్న మంజరికి- ఏదిముక్కో- ఏది ముఖమో తెలీని ఓనల్లని కారునుంచి వెంకటేశ్వర్లు దిగటం... అదీ తనకోసమే నన్న విషయం తెలియ టం కోసం ఎక్కువసేపు పట్టలేదు. వెంకటేశ్వర్లతో 'చనువు'గా వుండటంతో అటు శర్మ గొడవా ., ఇటు సినిమాఛాన్సూ సంపాదించింది మంజరి. Two birds at one shot.

పాకుడు రాళ్ళమీద నడుస్తుంటే పైకి వెళ్తున్నా మనిపిస్తుంది కాని ఎంతకిందకు దిగజారిందీ తెలియదు వెంకటేశ్వర్లులో ప్రారంభమైన ఆమె నటజీవితం అదు గడుగునా... అవసరం అయినప్పుడల్లా. . ఎవరో ఒక వెంకటేశ్వర్లు అదుకుంటూ వుండడంతో... విరోధా భాసాలంకారంలాగా, పైకి వెడుతున్నా మనుకుం టూనే దిగజారడం ప్రారంభం అయింది. స్థాయి పెరి గిన కొద్దీ- అవసరాలు పెరిగాయి. అవసరాలు పెరి గిన కొద్దీ- చిన్న వెంకటేశ్వర్ల సహాయంనుండి- బొంబాయి- బెంగుళూర్లనుండి అనుకున్నప్పుడల్లా అవసరం అయినప్పుడల్లా, స్వంత విమానం ఒకటి ఏర్పాటు చేసుకొని, రాగల పెద్ద వెంకటేశ్వర్లు లాంటి వాళ్ళు కావల్సి వచ్చారు మంజరికి.

తారాపథంలో పరుగు పందెంలో తల మున్కలుగా వున్న మంజరికి "కల్యాణి" ఒక మార్గదర్శి. A guider కల్యాణిద్వారా మంజరి చిన్న నిర్మాతల ప్రాపకంలోంచి పెద్ద నిర్మాతల ప్రాపకంలోకి ఎగ బ్రాకుతుంది. పాకుడురాళ్ళు కదామరి. ఎప్పుడు పట్టు చిక్కుతుందో.., ఎప్పుడు జారి పోతుందో తెలియదు.

"అదో తలనొప్పి వ్యవహారం, ఇవన్నీ తనెందుకు తెచ్చి పెట్టుకుంటుందో తెలియదు. ఓక్షణం కంటారా నిద్ర పోవడానికి లేదు. ఓ గంటసేపు ప్రాణానికి హాయిగా వుండేందుకు లేదు. ఎందుకొచ్చిన లాయి లాసా ఇదంతా?' అన్నట్లుగా వుంది- ఆమె స్థితి.

అంటే ఆమె ఇప్పుడు బాగా బిజీస్టార్ అయిపో యింది. ఈ కథ బాగాలేదు- ఆ పాత్ర బాగాలేదు. ఈ హీరోని పెట్టుకోండి- అమెచేత పాడించండి- అల్లా చేయకపోతే తాను నటించదు సరికదా- పెట్టు బడిదార్లచే పెట్టుబడి పెట్టించడగి కూడా మాన్పించగల స్థాయికి పెరిగిపోయింది మంజరి.

ఇది ఇల్లా వుండగా... ఆమెలో విదేశయాత్ర చేయాలన్న పిచ్చి ఊహ. ప్రాణం పోసుకొన్నది ఆసలే మదగజం ఘీంకరిస్తూ సినిమా ప్రపంచం అంతటా స్వైర విహారం చేస్తోంది. త్వద్ధానాంఛః పరి పుష్టి కీర్తి తరుచ్ఛాయల్లో అలవోకగా, విలాసంగా- సుతారంగా వున్న మదగజానికి విదేశాలకు వెళ్ళాలన్న కల్లును పోశాడు చలపతి. దీనితో మంజరి ఆరాటానికి అలజడికి అంతం లేకుండా పోయింది.

'ఇది ఇల్లా వుండగా కళ్యాణి ఆత్మ హత్య చేసు కుంది. ఆ గొడవలో. . బండబారిన మెదడుతో కొంత కాలం గడిచిపోయింది.ఆమె పోయినతరువాత చలపతి మంజరికి కల్యాణి గత జీవితం గురించి ఫ్లాష్‌బాక్‌గా చెప్పాడు.

ప్రతినటి జీవితంలోనూ ఇల్లాంటి వెలుగు నీడలు వుంటూనే వుంటాయి అనుకుంటుంది మంజరి.

ఆమె అమెరికా వెళ్లింది. అక్కడ ఆమె ఉచ్చారణ వేషధారణ అమెరికన్లను ముగ్ధులను చేసింది. ఆవిడ వారితో ఆమిత చొరవగా ప్రవర్తించింది. మంజరి ఒక సభలో ప్రసంగిస్తూ- నేను దౌత్య ప్రతినిధిగా మీ దేశం రాలేదు... కళాకారిణిగా వచ్చాను. అయినా- మీదేశంపట్ల, నాకూ, నాలాంటి కోట్లాది మందికి ఆమేయమైన సుహృద్భావం ఉన్నది. మీదేశం చూడా లని కలలు కనేవారు- నాకు మల్లేనే చాలామంది వున్నారు అంటుంది మంజరి. వారడిగిన ప్రశ్నలకు సమాధానంగా...

"మీ గోధుమలు తింటున్నాం. మీరిచ్చిన పాలపొడి పాలతో మాపిల్లలు పెరుగుతున్నారు. మీ వేషభాషలు చూసి మేము మురిసిపోతున్నాం. ఎం చేతనంటారూ? మీకూ మాకూ మవులిక విషయాలలో భేదంలేదు కనక. అంటుంది మంజరి మరొకచోట

మంజరి పసిగట్టుకొని మారి అనేమన్రోనూ, ఎలిజబెత్‌టేలర్‌నూ చూసివచ్చింది. మన్రోను ఆమె నవ్వును చూసి, అ నవ్వుకోసం, దేవతలు పడిచావ మన్నా చస్తారు. ఇక మనుషుల సంగతి లెఖ్ఖేమిటి.. అనుకున్నది.

ఇక్కడ భాషపై భరద్వాజగారి-కున్న అధికారం ద్యోతకం అవుతుంది శ్రీనాథుడు తమలపాకులు అమ్మే లింగశాస్త్రిని గురించి చెప్పిన చాటువు సరిగ్గా ఇక్కడ గుర్తుకు వస్తుంది.

ది ప్రిన్స్ అండ్ డిగోగరల్ పిక్చర్ చూసిం తరువాత నేను మగవాడిని కానందుకు చాలా రోజులు బాధపడ్డాను, అని మంజరి అన్నప్పుడు- మారిలిన్ మనసారా నవ్వింది కాని ఆ నవ్వులో ఏ మూలనో విషాదరేఖ లీలామాత్రంగాగోచరించింది మంజరికి.

"భగవంతుడు నాకింత అంద మిచ్చినందుకు సంతోషించాలో ఏడవాలో కూడా తెలీదు. నా ఫొటోల కోసం కోట్లాది ప్రజలు ఎదురుచూస్తుంటారని తెలిసి నప్పుడు నేను వారిని పరోక్షంగా బాధ పెడుతున్నానా' అనిపిస్తోంది. అన్నది మన్రో. "ఇక్కడున్న తారల కున్న వ్యక్తిత్వం చాలా పరిమితం. నిర్మాతలు ఏం చెప్పినా చెయ్యవలసిందే. ఎవరో నాబోటి మొండి ఘటాలు మాత్రం కాదని ఎదురుతిరిగి లేనిపోని చిక్కులు కొనితెచ్చుకుంటారే తప్ప ." అంటుంది మారిలిన్ మన్రో.

ఏదేశంలో అయినా.. మనం ఆరాధించే సినీతారల వ్యక్తిత్వాలు ఎంతటి పరాధీనాలో- ఈ సినిమా ప్రపంచం ఎంతటి నిరంకుశమైందో భరద్వాజగారు కళ్ళకు కట్టినట్లుగా చెప్తారు.

"ఈ అందం నన్ను పాడు చేస్తున్నదేమో నను కుంటాను దీని కోసం కోటీశ్వరులైన వాళ్ళు నా పాదాలముందు సాగిలపడి, ఆకర్షణలవల పన్ని, నన్ను స్థిమితంగా వుండనివ్వటంలేదు. ఇంకొకరి కోసమని అవన్నీ నటించలేను. ." అన్నది మారిలిన్.

ఇది తెలిశాక ప్రతి నటిజీవితంలోనూ ఇలానే వుంటుందేమోననిపిస్తుంది.

''మీకు మనుషులంటే కసిగా వుంటుందా?'' అని మంజరి అడిగిన ప్రశ్నకు బదులుగా మన్రో ఇల్లా ఉంటుంది.

''నాకు మనుషులంటే పరమ ద్వేషం వుంది. కాని అందరిమీదా కాదు. నన్ను బాధించిన వ్యక్తులన్నా, తరిమికొట్టిన వ్యక్తులన్నా, అడగడుగునా ఆటంకాలు కల్పించిన వారన్నా, నన్ను ఇరుకుల్లో పెట్టి, వొంచి, చీల్చి, తమ అవసరాలు గడుపుకు నేవారన్న పరమ ద్వేషం."

'ఒకప్పుడు ఎందుకూ పనికి రావనిపించుకున్న మన్రో ఇంటిముందు- కోటీశ్వరులు చేతులు కట్టుకుని నిలబడతారు...' అంటుంది. ఇక్కడ నన్ను ఇరుకుల్లో పెట్టి- తమ అవసరాలు గడుపుకునే వారంటే అసహ్యం." అన్న వాక్యాలు కావ్యార్థసూచన చేస్తాయి.

ఏ పరిస్థితుల్లోనైనా- తమ వ్యక్తిత్వం నిలబెట్టుకోవాలని చూసి- ఓడిపోయే వారి చిత్రాన్ని మన్రో-మంజరి సంభాషణల ద్వారా- చిత్రిస్తారు భరద్వాజ గారు.

బ్రతుకు మీద ఆశ లేదంటుంది- మన్రో.

"బ్రతుకు ఇప్పటికే నన్ను దగా చేస్తున్న దనుకుంటాను. ఈ డబ్బు- ఈ కీర్తి, నాగరికత, ఇవన్నీ నాకు కావలసిందాన్ని సాధించలేకపోయాయి. చేతికి చిక్కినట్టే చిక్కి, ఫలితం జారిపోవటం నా బ్రతుకులో చాలాసార్లు జరిగింది. ఈ ఆఘాతాలు నన్ను కృంగదీస్తున్నాయి...'' అంటుంది మన్రో.

ఇక్కడ స్త్రీ జీవితాన్ని గురించి చేసిన వ్యాఖ్యానం భరద్వాజగారి లోకజ్ఞతకు గీటురాయి. జీవితంలో ఇమడలేక జీవుడు గిజగిజలాడి పోవటాన్ని ఒక్క భరద్వాజగారే చిత్రించగలరనిపిస్తుంది.

ఈ విధమైన అనేక అనుభవాలతో అమెరికానుండి తిరిగి వచ్చిన తరువాత పరిస్థితుల ప్రభావంవల్ల బొంబాయిలో వుంటుంది మంజరి. అక్కడేదో మరో మెట్టుపైకి ఎక్కాలనుకుంటుంది. కాని పెరోబలాకు చేరుకున్న సంగతి...తెలుసుకోలేకపోతుంది.

"నాకు సహాయపడతానని-ఇలా ఉచ్చుల్లో బిగించడం ధర్మంకాదు. నేను అన్యాయార్జన కోసం "బ్లూ ఫిల్మ్''లో నటించలేదు. దాన్ని బయలుపెట్టకండి. అలాగే-మీకెంతకావాలో రేపొచ్చి పట్టుకెళ్లండి.

ఈ వాక్యాలు ఇక్కడ ఇప్పుడు చదువుతుంటే ఈ మాటలు ఇదివరకెక్కడో విన్నట్టనిపిస్తుంది మనకు. ఈ విధంగా 'జీవుని' అలజడి చిత్రించటం- ఒక్క ప్రతిభావంతుడైన కవికి మాత్రమే సాధ్యం అవుతుంది

మన్రో ఇంతకు ముందు వ్యక్తపరచిన-ఇరకాటంలో పెట్టటం-తన అవసరాలను గడుపుకోవటం-లాంటి భావాలు-ఇప్పుడు మంజరిపట్ల రుజూ అవుతాయి. ఫలితం అందినట్లే అంది జారిపోవటం జరుగుతుంది. చివరకు మంజరి ఆత్మహత్య చేసుకొంటుంది.

పాకుడురాళ్ళ మీద జారిపడటం చాలా సులభం. పడినతరువాతగాని పడినట్లు తెలియదు. అదే..... మంజరిపట్లా జరిగింది.

"ఇల్లా జరుగుతుందని తెలిస్తే ముందుగానే జాగ్రత్త పడి కడుపులో దాచుకునేదాన్ని అంటుంది తాయారు చిట్టచివరిగా.

ఇలా అందరూ అనటం సహజం.

ఈ విధంగా-మంజరి- చలపతి-శర్మ- వసంత-మన్రో-పాత్రల్లోంచి మనకు ఒక చిత్రకారుడుగా-ఒక ఫోటోగ్రాఫరుగా-ప్రసన్నకథాకలితార్థయుక్తి గల రచయితగా-లోకజ్ఞుడుగా-అన్నిటికి మించి కంటికి కనుపించని "జీవి"ని రూపుదిద్దటంలో ప్రతిభావంతుడుగా-రసస్రష్టగా- మనకు భరద్వాజగారు కని పిస్తారు.

He is ivory to here of artistic and lively picturised elemεnts of human behaviour.

"జయంతితే రససిద్ధ కవీశ్వరః

5/1 కృపా కాంప్లెక్స్
నేరేడ్ మెట్
రామక్రిష్ణా పురమ్ పోస్టు
సికింద్రాబాద్. 500556

# సూచన

1. ఫిబ్రవరి 1983 పరీక్షల సర్టిఫికెట్లు ఆయా కేంద్రాలకు పంపించి వేయడమైనది.
2. ఆగస్టు 1983 నాటి పరీక్షల ఫలితాలు ప్రకటించుటకు ఏర్పాట్లు చేయనైనది.

-విశేషాధికారి

# తెలుగు నైషధం

—వసునందన్

"నైషధీయ చరితమ్" (సంస్కృతం) కేవలం కావ్యంమాత్రం కాదు. అది ఒక వేదాంతశాస్త్రం. ఒక వ్యాకరణశాస్త్రం. ఒక న్యాయశాస్త్రం. అన్నింటినీ మించి ఒక మంత్రశాస్త్రం. దానిలోని పాత్రలన్నీ కొన్ని భావాలకు సంకేతాలు. ఇటుచూస్తే లౌకిక మైన ఒక కథ. గ్రంథాంతంలో హర్షుడు తానే చెప్పినట్లుగా గ్రంథగ్రంథుల మూలంగా ఆ మహాకవి ఇహపరలోక ద్వయానికి. సమైక్యతను కూర్చినాడు. చింతామణీ మంత్రసిద్ధుడైన శ్రీహర్షునికి కాక వేరొక్కనికీ కూర్పు సాధ్యమగునో కాదో! 'చింతామణి' సరస్వతీ దేవతకమా? శ్రీకృష్ణ దేవతకమా? అన్న ప్రశ్న కింకా మంత్రశాస్త్రవేత్తలకే సమాధానం దొరకలేదు. ఇదిలా ఉంటే, చింతామణీ మంత్ర స్వరూపమే హర్ష నైషధమని మరోవాదం ఐతే కావచ్చును కవి తన్మంత్ర సిద్ధుడుకదా! దీనిలో ఇన్ని పొరలు, కాబట్టే అది 'విద్వదౌషధం'.

ఇన్ని లక్షణాలున్న హర్షకావ్యాన్ని కేవల కావ్యాలంకార దృష్టితో శ్రీనాథుడు తెనుగు చేయడం జరిగింది. కాబట్టి దానిస్వరూపం వేరు, దీనిస్వరూపంవేరు ఆంధ్రీకరణలోని ఔచిత్యా నౌచిత్య వాదాలెన్నో బయలుదేర డానికి మూలకారణమిది. కావ్యదృష్టితో చూచే లౌకికునికి శ్రీ నాథౌచిత్యం స్ఫురిస్తే మూల దృష్టితో పరిశీలించే వేరొకనికి శ్రీహర్షమహానుభావుకత గోచరింపవచ్చును. కాబట్టి ఈ వాదా[illegible]వసరం కావ్యాన్ని చూచిన చూపులోనే ఇద్దరూ విభిన్నులు. శ్రీనాథు డౌచిత్యాన్ని పాటించాడంటే కేవల కావ్య కల్పనా (రస) దృష్టితో మాత్రమేనని అర్థం

ఇన్ని మెలికలున్న కావ్యానికి తెనుగులో శ్రీకారం చుట్టే సాహసం శ్రీనాథుని వంటివాడుతక్క నూటికి నూరుపాళ్ళు వేరొకడుచేసే వీలులేదు మూలం సంగతలా ఉంచితే శ్రీనాథుని ఆంధ్రీకరణ విధానమే అనితరసాధ్యం. (22) సర్గలో (2800) శ్లోకాల్లో ఉన్న నైమిశారణ్యాన్ని శ్రీనాథు డెనిమిదాశ్వాసాల, (1280) గద్యపద్యాల నందనోద్యానంగా తెలుగు చేసినాడు, మూలసంబంధి సంక్షిప్తత, సంస్కరణం, తెలుగు కావ్యమంతటా ఉన్నది.

అతివేల వర్ణనలూ, శృంగార ఘట్టాలూ విడువబడినవి. కథాగమన, పాత్ర చిత్రణాదుల పైగల శ్రీనాథ దృష్టి ప్రశంసార్హం, అంగీరసమైన శృంగారంలోకంటే అంగమైన తరుణంలోనే అతడెక్కువగా రసించెనని పించును. బ్రాహ్మీదత్త వరప్రసాదుడుకాబట్టి శ్రీనాథుడింతపనిచేసి నారికేళ పాకంలోని మూలాన్ని మధుర కదళీపాకానికి దించినాడు. కావ్యప్రణాళికవేరు, దృష్టి వేరు, నిర్వహణంవేరు, శిల్పంవేరు— కాబట్టి "నైషధీయ చరితానికి" ఆయనపెట్టినపేరు "శృంగార నైషధం" ఇన్ని విషయాలను పర్యాలోచించే ఈ వ్యాసాన్ని నేను తెలుగునైషధమని ప్రారంభిస్తున్నాను.

"యశో యదస్యాజని సంయుగేషు
కండూలభావం భజతాభుజేన
హేతోర్గుణాదేవ దిగాపగాళీ
కూలంకషత్వ వ్యసనం తదీయమ్.

ఇది హంసనల భుజబలాన్ని హంసకు చెప్పినప్పటి శ్లోకం. రణకండూతిగల నలుని భుజంలో పుట్టి

యశస్సు— కారణగుణం కార్యానికి సంక్రమించు నేమో అన్నట్లుగా దిక్కులనే నదీసమూహపు గట్లను రాస్తున్నదేమో అన్నట్లున్నదని దీనిభావం. ఇట యశస్కారణమైన భుజం నిమిత్తకారణం. తానే కారణం కాదు. నిమిత్తకారణగుణం కార్యంలో సంక్రమింపదు. ఐనా సంక్రమించినట్టుగా వ్రాయడం ఉత్ప్రేక్ష 'కారణ గుణాః కార్యే సంక్రామంతి" అను న్యాయాధారమైన శ్లోకాన్ని శ్రీనాథుడు సంస్కరించి, రూపకగర్భంచేసి 'రణకండూభర దుస్సహంబయిన' అనే పద్యంలో రమ్యంగా అనువదిందాడు. మూలంలోని కేవల 'యశ' శ్శబ్దాన్ని 'కీర్తి ప్రవాహంగా', 'దిగాపగాళీ కూలాలను' "ప్రస్ఫీత దిగ్మత్త వారణ గండస్థల కుంభకూలాలుగా అలంకరించినాడు కూలాలను శ్లిష్టం (శిఖరం) ప్రయోగించినాడు, 'దివారాత్రముల రాయునని, భావపుష్టి కూర్చినాడు. కావ్యమంతటా ఆలంకారిక దృష్టితో ఇలాంటి సంస్కరణలు శ్రీనాథుడు పెక్కులు చేసినాడు.

"సువర్ణశైలా దవతీర్యతూర్ణం
స్వర్వాహినీ వారికణావ కీర్ణైః
తం వీయయామహ స్మరకేళి కాలే
పక్షైః నృపమ్ చామరబద్ధ సఖ్యైః".

అని నలవైభవాన్ని, తనకాతనికిగల స్నేహాన్ని హంస దమయంతికి చెప్పే సమయంలో 'స్మరకేళి పరి శ్రాంతుడైన నలున కృపీకునని" ఉన్నదాన్ని శ్రీనాథుడు రసౌచిత్య దృష్టితో-కన్యయైన దమయంతి ముందట్టి వాగ్వైఖరి సముచితంకాదు కాబట్టి— తన "కనక శైలంబుడిగ్గి' అనే పద్యంలో నల శ్రాంతిని "వైశాఖవేళా" సముద్భూతంగా సవరించాడు. ఇట్లే రసదృష్టితో పెక్కుమార్పులు.

మూలంలో హంస దమయంతితో "చిత్త మభి లషించిన సముద్ర మధ్యంలో నున్న లంకయందలి వస్తువునైనను సాధింపవచ్చుననగా దమయంతి-

"ఇతీరితాపత్ర రథేనతేన
హ్రీణాచ హృష్టాచ బభాఃభై మి
చేతోనలంకా మయతే మదీయం
నాన్యత్ర కుత్రాపిచ సాభిలాషమ్".

అని సమాధానిస్తుంది దీనిలోని భావాలు రెండు ఒకటి సిగ్గువలని సమాధానం. రెండోది తుష్టివలన పుట్టింది. ఈ రెంటినీ శ్లిష్టంచేసి "నలంకామయతే" అని శ్రీహర్ష ప్రయోగం.

1) న + లంకామీ × అయతే—అనగా నామనస్సు లంకలోని వస్తువును కోరదు. ఇంకో వస్తువును దేన్నీ కోరదు) ఇది సిగ్గు పలికిన సమాధానం.

2) నలం × కామయతే— నామనస్సు నలునే కోరుతుందని సంతుష్టితో ఇచ్చిన సమాధానం.

ఈశ్లేష తెలుగులో కుదరదు, కాబట్టి శ్రీనాథుడు దీన్ని పరిత్యజించాడు. ఇట్లే పెక్కుశ్లేషలు విడిచి పెట్టడం జరిగింది. నిజానికి శ్రీనాథునికి శ్లేషమీద ఇష్టం తక్కువ అతని కృతులన్నిటినీ పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. ఐనా పైశ్లేష ప్రభావం "అనల సంబంధ వాంఛనా కగునయేని అనలసంబంధ వాంఛనా కగునమావె" అనే పద్యం (యమకం)పై పడింది.

"అశక్య శంక వ్యభిచార హేతువు, గవాకర్మకృతనే కవీవృతుడు," ఇత్యాది పదబంధ ప్రయోగాలు యథా మూలకాలు.

ఈ విధంగా శ్రీనాథుడు "మూలము ననుసరించియు, ఔచిత్యము భూషించియు, అనౌచిత్యము. పరిహరించియు, వలసినయెడల సంక్షేపించియు, కేవల భావానువాదమును జేసియును, అలంకారముల నలంకరించియు, అమూలక రచనా విధానముల ననుసరించియు, నైషధీయ చరితమే' తెలుగునకు దించినాడు.

శ్రీనాథునికి నైషధంపై మహాభిమానం జీవితకాల మంతా దాన్ని అతను స్మరిస్తూనే ఉన్నాడు. "ఆంధ

భాషా నైషధాబ్ధి భవుని అని హరవిలాసంలో 'కల్పించి నాడవు గాఢపాకంబైన హర్షనైషధ కావ్యమాంధ్ర భాష' అని భీమఖండంలో వ్రాయడమేకాక, నైషధ కృతి భర్తయైన సింగనామాత్యునితో 'భట్టహర్షుడు ప్రౌఢ వాక్పాటవమున నెద్ది రచియించె బుధలోక హితముపొందె అట్టి నైషధ సత్కావ్య'మనిపించినాడు.

రెండవ సర్వజ్ఞసింగ భూపాలుని చూడబోయినపుడు కూడా 'పలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య నైషధ గ్రంథ సందర్భమునకు' అనీ, చివరికి అంత్యకాలంలో సైతం 'ఆంధ్రనైషధకర్త ఆంఘ్రి యుగ్మమ్మున దగిలియుండెనుగదా! నిగళయుగము' అనీ శ్రీనాథుడు దాన్ని స్మరించడాన్నిబట్టి నైషధ కావ్యమాతని మనస్సు నాక్రమించిన మహాస్థానం ప్రస్ఫుటమవుతున్నది.

ఇలా బ్రాహ్మీదత్త వరప్రసాదుడై, బ్రహ్మేంద్రాది నానాపురాణ పారంగతుడై, లోకజ్ఞుడై, రాజకీయజ్ఞుడై మానవ మనస్తత్వ పరిశీలకుడై మహాకవి ఐనవాడు కాబట్టే శ్రీనాథుడు తెలుగు నైషధాన్ని చేయగలిగినాడు. ఇతరులకది అసాధ్యం.

ఆంధ్రకావ్య నందనవన పారిజాతం శృంగార నైషధం'

# స్వర్గీయ శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారి వ్యక్తిత్వం

—పటగర్ల రామమోహన రావు

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు సామాన్య కుటుంబంలో పుట్టి తానే మిటో తెలుసుకుంటూ తెలుసుకున్నది ఎదుటి వారికి బోధిస్తూ జీవితంతో ఉన్నత శిఖరాలను అందుకున్న గొప్ప వ్యక్తి శ్రీ బ్రహ్మయ్యగారు. హిందీని అభ్యసించటం ద్వారా జాతీయ భావాలు పెంచుకుంటూ జాతిపిత పూజ్య బాపూజీ పిలుపునందుకుని జాతీయోద్యమంలో పాల్గొని పలుమార్లు కారాగారంలో మూడున్నర సంవత్సరాలు గడిపారు ఎంతో మంది యువకులను సుశిక్షుతులుగా తయారుచేసి జాతీయోద్యమంలో పాల్గొనేట్లు చేశారు. అతి పిన్నవయస్సులోనే ఆనాటి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఆచార్య రంగాగారి ఆశీస్సులతో ఏలూరు మునిసిపల్ చైర్మన్‌గా ఎన్నికయినారు శ్రీ వీరమాచనేని వెంకట నారాయణ శ్రీ దామరాజు వెంకట్రావు శ్రీ దుగ్గిరాల రాజశేఖరరావు వంటి మేధావులు గల కౌన్సిల్‌ను ఎంతో సామర్థ్యంగా నిర్వహించారు. విధాన సభలో ఏలూరు నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహించారు ఒకసారి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని బలపరచిన కారణంగా మంత్రి పదవి రాలేదని చాలామందికి తెలుసు. మరొకసారి శ్రీ నీలం సంజీవ రెడ్డి గారిని బలపరచిన కారణంగా పార్లమెంటు అభ్యర్థిత్వం రాలేదని చాలా మంది భావించారు. గాలికి అనుకూలంగా వెళ్ళడం తెలియని కారణంగా రాజకీయాలలో రాణించవలసినంతగా రాణించలేక పోయారు శ్రీ బ్రహ్మయ్యగారు.

## కళారంగంలో

ఏలూరు మునిసిపల్ రజతోత్సవ సందర్భంగా జరిగిన ఉత్సవాలకు విచ్చేసిన మద్రాసు గవర్నర్ శ్రీ భావనగర్ మహారాజా హిందీ షాజహాన్ నాటకంలో షాజహాన్‌గా శ్రీ బ్రహ్మయ్యగారి నటనను శ్లాఘించారు. చంద్రగుప్త హిందీ నాటకంలో చాణుక్యునిగా శ్రీ బ్రహ్మయ్యగారు ప్రశంసనీయంగా నటించారు. భక్త రామదాసు చిత్రంలో సలీం పాత్రను పోషించారు.

## హిందీ బ్రహ్మయ్య

కారాగారంలో వున్నా బయట వున్నా తోటి వారికి హిందీని అభ్యసింపచేయటం శ్రీ బ్రహ్మయ్యగారికి అలవాటు అ కారణంగానే శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు. హిందీ బ్రహ్మయ్య అని పిలిచేవారు. హిందీపట్ల అపారమైన ప్రేమాభిమానాలు కలిగివుండేవారు. అంతేకాదు శ్రీ బ్రహ్మయ్యగారు ఆహ్వాన సంఘ అధ్యక్షులుగా ఏలూరులో ఆంధ్ర రాష్ట్ర హిందీ మహాసభలు వైభవోపేతంగా జరిపించి పూజ్య శ్రీ ఆచార్య వినోబాభావే, శేఠ్ గోవిందదాస్ శ్రీ అనంతశయనం అయ్యంగారల ప్రశంశలను అందుకున్నారు. వేర్వేరు సందర్భాలలో రాష్ట్రపతి శ్రీ రాజేంద్ర బాబు. శ్రీ కాకా కలేల్‌కర్, గవర్నర్ శ్రీ ప్రకాశ్ శ్రీ భాష్యం అయ్యంగార్ల నుండి కూడా అభినందనలు అందుకున్నారు. కేంద్రీయశిక్షా సమితిలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రతినిధిగా మూడు సంవత్సరములు. అనేక సభలలో సమావేశములలో పాల్గొని హిందీ ప్రాంతీయ పండితుల అభిమానములకు పాత్రులై హిందీ పాత్రికేయుల ప్రశంశలను కూడా అందుకున్నారు. ఒక సమావేశంలో శ్రీ బ్రహ్మయ్యగారి హిందీ వకృత్వమును కేంద్ర విద్యా మంత్రి శ్రీ శ్రీమాలి ఎంతో శ్లాఘించారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్రశాఖ రజతోత్సవాల

కమిటీకి గౌరవకార్యదర్శిగా వుండి శ్రీ బ్రహ్మయ్యగారు సభలు జయప్రదంగా జరిపించి. అఖిలాంధ్ర ఖ్యాతిని పొందారు. ఆ సందర్భంలో విచ్చేసిన రాష్ట్రపతి శ్రీ రాధా క్రిష్ణన్ లాల్‌బహదూర్ శాస్త్రి. హిందీ పండితుల సుప్రసిద్ధ కవుల సమక్షంలో శ్రీ బ్రహ్మయ్య గారు. తన హిందీ భాషాభిమానాన్ని ప్రదర్శించుకున్నారు. ఏలూరు హిందీ ప్రేమీ మండలికి నలభై సంవత్సరాలు అధ్యక్షులుగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ కార్యవర్గ సభ్యులుగా ఆంధ్ర శాఖకు అధ్యక్షులుగా భాషా వ్యాప్తికి ఎంతగానో తోడ్పడినారు.

## నిజాయితీకి మారుపేరు

ఎంతోపరిశుభ్రంగా వుంటూఎప్పుడూ స్వచ్ఛమైనతెల్లని ఖద్దరు దుస్తులు ధరించే శ్రీ బ్రహ్మయ్యగారి మనస్సు కూడా అంత స్వచ్ఛమైనదే, అర్థం చేసుకున్న వారికి ఉత్తముడు. శ్రీ బ్రహ్మయ్యగారు. మునిసిపల్ చైర్మన్‌గా వుండగా ఎవరో ఏదో కానుకగా పంపిస్తే ఆయన విసిరి వేసిన సంగతి వాటిని తీసుకున్న తన అర్థాంగిపై ఆగ్రహం చెందిన విషయం అప్పట్లో ఏలూరు అంతా చెప్పుకున్నారు. ఆర్. టి ఎ. సభ్యులుగా వుండగా బస్సు రూటుకు సిఫార్సు చేయమని అర్థిస్తూ ఒక రాజుగారు శ్రీ బ్రహ్మయ్యగారికి డబ్బు యివ్వబోయారట అంతే ఆ రాజుగారిని వీధి చివర వరకూ తరుముతూ వుంటే వీధిలోని వారంతా విస్తుపోయారట, యిలా అనేకం. రాజకీయాలలో ఎవరితోనూ రాజీపడలేని వ్యక్తిత్వం కలిగిన వ్యక్తి శ్రీ బ్రహ్మయ్యగారు. ఆయన యింటి నుండి బయలుదేరి వస్తుంటే వీధి చివర వరకూ చిన్న పిల్లలు నమస్కారాలు పెడుతుండేవారు. మీకు ముక్కోపం అని తెలియక పిల్లలు ధైర్యంగా ముందుకు వచ్చి మీకు నమస్కారాలు పెడుతున్నారండీ అని నేను అంటే అది కాదు రామమోహనరావు వాళ్ళు స్వార్థం ఎరుగని పసివారు. అందుకే నాకు నమస్కారం పెడుతున్నారు. అని నవ్వుతూ అన్నారు శ్రీ బ్రహ్మయ్యగారు.

శ్రీ బ్రహ్మయ్యగారికి కోపం ఎంత తొందరగా వచ్చేదో అనుగ్రహం కూడా అంత తొందరగా కలిగేది ఆయన ఒక ప్రత్యేకమైన వ్యక్తి వారిని ఎవరితోనూ పోల్చలేము. ఆయనకు ఆయనే ఒక పోలిక ఆయన ఏ హిందీఉద్యమం ద్వారా ప్రజాజీవితాన్ని ప్రారంభించారో. అదే హిందీ కార్యక్రమంలో పాల్గొనే నిమిత్తం మద్రాసు వెళ్ళి హృద్రోగంతో చివరి శ్వాస విడిచారు. శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారిని నియబద్ధమైన జీవితం నేటి యువతరానికే గాక భావితరాల వారికి కూడా ఆదర్శవంతమైనది.

పడమర వీధి
ఏలూరు.

# సాహిత్యగోష్ఠి

## హిందీలో చిత్రకవిత్వ పరిచయము

కవిత్వమనగా ఏమి? కవితలో కవిత్వమెంత వరకున్నది? అనెడి ప్రశ్నల జోలికి పోక పోయినను సామాన్యముగ పద్యములు, గేయములు, పాటలు, వచనకవితలరూపమునకవిత్వముండునని మాత్రము అందరికి తెలియును కవిత్వము నిర్వచనము తెలియకపోవచ్చును కానిచిత్రకవిత్వమననేమో పెక్కుమందికి తెలియదు. దాని నిర్వచనము సులభము. చిత్రముగా ఉండుకవిత్వము చిత్రకవిత్వము.

చిత్రపదమునకు ఆశ్చర్యము, ఆలేఖ్యము అను అర్థములు కలవు రచన ఆశ్చర్యమును కలుగజేయునది అయిన చిత్ర కవితయని అందుము. ఆలేఖ్యమనగా చిత్తరువు. పద్యాక్షరములు ఆలేఖ్యారూపమున ఒక నియమమున ఉంచబడిన దానిని గూడ చిత్రకవిత్వమనే అందుము. పద్యమున పద్యములు గూఢ మొనరించిన రచన గలదు. ఇది ఆశ్చర్యకరము కదా. ఇదిగూడ చిత్రకవిత్వము క్రిందికే వచ్చును. సంస్కృతమున కావ్యానుశాసనకర్త ఈక్రింది విధముగ చిత్ర కవిత్వమును నిర్వచించెను.

"స్వరవ్యంజన స్థాన గతాకారనియమ చ్యుత గూఢాది చిత్రమ్ "తలకట్లు, గుడులు మున్నగునవి స్వరచిత్రము, ఏకాక్షరి, ద్వ్యక్షరి మొ॥ వ్యంజన చిత్రము, నిరోష్ఠ్యాదులు స్థాన చిత్రము, అనులోమ విలోమ పాదములు, పద్యములు గతిచిత్రము, బొమ్మలు చిత్రించి పద్యాక్షరము లందు బంధించి చూపుట ఆకార నియమచిత్రము (ఫణిబంధము, గోమూత్రికా బంధము మున్నగునవి) మాత్రా, వర్ణములు చ్యుతమొనరించి చూపుట చ్యుతచిత్రము, పద్యమున పాదము లేదా పద్యములు గూఢ మొనరించిచూపుట గూఢ చిత్రము, ప్రహేళికా, ప్రశ్నోత్తరాదులు ఆదీ చిత్రము క్రిందకు వచ్చునని పై నిర్వచనమును బట్టి గ్రహింపవచ్చును. ఇవన్నియు చిత్రకవితా రీతులు.

ప్రతిభాషలోనూ చిత్రకవిత్వ మున్నది. సంస్కృతమున 8వ శతాబ్ది (క్రీ. శ.), నుండి, తెలుగున 12వ శతాబ్ది (క్రీ. శ.) నుండి, కన్నడ, అరవముల ఇంచుమించు 9వ, శతాబ్ది (క్రీ. శ ) నుండి, గ్రంథస్థమై చిత్ర కవిత గన్పడుచున్నది పాశ్చాత్య భాషలలో అలెగ్జాండరు కాలమునకు చిత్ర కవిత వికసించినట్లు బెరిడల్ కీత్ పండితుడు చెప్పియున్నాడు. (చూడు History of Sanskrit Siteration, పుట. 127).

తెలుగులో వలె హిందీలోను క్రి. శ. 16వ శతాబ్ది నుండి చిత్రకవిత విస్తరిల్లినది అకాలమును హిందీ సాహిత్యంలో రీతి కాలమంటారు. కేశవదాసు, భిఖారిదాసు, లాల్‌కవి, గోకులనాథ్, దీనదయాళగిరి, మున్నగు కవిశ్రేష్ఠులు చిత్ర కవిత్వములో సిద్ధహస్తులు. వారిలో కేశవదాసు, దీనదయాళగిరి కవివర్యు లొనరించిన చిత్ర కవితారీతుల నుదాహరించుచు హిందీలో చిత్ర కవిత్వమును పరిచయ మొనరింతును

ఆచార్య కేశవదాసు నిరోష్ఠ్య రచనము చేసెను. ఏకాక్షరి ద్వ్యక్షరి, త్ర్యక్షరి, చతురక్షరిపాదములను రచించెను. ఇతడు షడ్వింశత్యక్షరి వరకు ఏకాక్షర్యాదుల నుదాహరించియున్నాడు. అందలి చతురక్షరి పద్యము.

"బనమాలీ బన మే మిలే బ నీ నలిన బనమాల
నమన మిలీ మన మన మిలీ బైన న మిలీ న బాల"

పై పద్యమున 'బనమల' అను నాల్గక్షరములు మాత్రమే ప్రయుక్తములైనవి. ఆ నాల్గు వ్యంజనములే యుండవలెను. కాని వానిపై ఏ అచ్చైనను ఉండవచ్చును.

ప్రశ్నోత్తర చిత్రములో భేదములు పెక్కులు ప్రదర్శించినాడు. వానితో బహిర్లిపిక.

"అక్షర కౌన్ వికల్పకో, జువతి వసతి కిహి అంగ్,
బలిరాజా కౌనే ఛలే సురపతికే పరసంగ్।
— వామన జానిజా॥".

సమాధానం పద్యము బయట ఉండును.
ఇక అంతర్లిపిక.

"కౌన్ జాతి సీతాసతీ దయీకౌన్ కహఁ తాత్
కౌన్ గ్రంథ్ బరనీ హరీ, రామాయన అవదాత్॥"
సమాధానము పద్యములోనే ఉండును.

గతి చిత్రములో గతాగతైకార్థము ఉదా :—
"మాల బనీ బలి కేశవదాస సదా వశకేలి బనీబలమా
గతాగత భిన్నార్థమున కుదాహరణము:

"సైన న మాధవ జోసర కేశవ రేఖసుదేశ సువేశ సజై"
ఇది విలోమపద్యము చివరి పాదముగా ఇట్లుండును

"జైస శువేసు శదేసు ఖరే వశకే రసజో వధ మాన నసై"

ఇతడాకృత్యాత్మక చిత్రబంధములో అనగా బంధకవిత లో చక్ర, కమల, పర్వత, సర్వతోముఖ, హార, డమరు, బంధములు సోదాహరణముగ నిరూపించెను.

దీనదయాళ గిరికవిగూఢ చిత్రములో పద్యగూఢమును చెప్పియున్నాడు. మూల రోలా ఛందమున ద్రుతవిలంబిత పద్యమును గూఢమొనరించెను. మధ్యాక్షరములు గ్రహించుచు పోయిన ద్రుతవిలంబితమువచ్చును.

ఉదా॰- గంగా జయ జన జనని దేవి సంపద తనశ్రీ తన
హేమంజులగతి కలని పురాతన శివతాకే గన
కుసుమ మలయ తిలఛిపా సుతట భావన జలపావన
ట రిభవ భవ భా కరీ సివై తై కేతే భువిజన॥
పరసే దివ్య విమాన కామ జితవపు తే పాయే
పాప తాప బిన జనా సదా శివ లొకై ఛాయే
సని తప నాది దివేస శంభు శ్రీ కుజ గురుసేవై।
శంభు ముకుట ఉరుమాల కాల సశి దివి కే దేవైఁ॥

రెండక్షరములువదిలి తర్వాత అక్షరము గ్రహించినచో గర్భిత పద్యము వచ్చును, ఇందలి సంస్కృత ద్రుతవిలంబితము:

"జనని సంతత మంగళరాశికే
శుమతి పాఢన పాటవ భాసికే
విపది మామవ పాప వినాశికే
సపది శంకురు శంకురు కాశికే.

ఇతని అనే క్రానే కోత్తరము చిత్రతరమైనది.

ఉదా:- వాసర కో కహైఁ కహా? కౌన్ వాచీ ఔసర కో?
కహా కరై బలి? కౌన్ అలీ కో సింగార్ హై?
వృంద పర్ జాయే కహా? కౌన్ నింద్యాభాజన హై?
పార్ కే సమాన కౌన్ప్రాణిన కో ప్యార్ హై ?
కౌన్ తరునామ్? కౌన్ చామ్పై రచే హై; స్యామ్
కేతే రవి రూప్? ధూప్ కాపై హితకార్ హై ?
కౌన్ దీ నద్యాల్ దేవ్? కౌన్ కీ న కీజై సేవ్?
ప్రశ్న యే అనేక జ్వాబ్ దీనో ఏక్ బార్ హై,

అన్ని ప్రశ్నలకు వారపదములో సమాధాన మిమిడియున్నది. ఆది "వారః సూర్యాది దివసే ద్వారేవ సరవృందయోః
కులే వృక్షే హరే వారోవారం మద్యస్యభాజనే॥"

ఇతడాకార చిత్రమున "షోడశ దళపద్మ బంధము, డమరు కపాట, ద్వాదశ దళ పద్మము (నిరోష్ఠ్యము), చక్రము. ఫణి, బంధముల చిత్రించినాడు. స్వర చిత్రమున ఏక స్వరము, సర్వ లఘువులను రచించెను.

తులసీదాసు రామచరిత మానసమున ఛత్ర, ఖడ్గ, నాళ, సనాళ పద్మ, త్రిశూల, నాగ, మయూర, కిరీటములనెడు ఆకార నియమ చిత్రభేదములను రచించెను, అశ్వగతి బంధమును వ్రాసి యున్నాడు.

ఆది

| న | పా | మి | శీ | క్ర | కో | స | లం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 10 | 3 | 12 | 5 | 14 | 7 | 16 |
| భ | కా | మి | నాం | ప | ధా | బు | దం |
| 17 | 26 | 19 | 28 | 21 | 30 | 23 | 32 |
| కృ | మా | లు | భ | ల | వ | మ | లం |
| 9 | 2 | 11 | 4 | 13 | 6 | 15 | 8 |
| అ | జా | మి | తే | స్వ | దాం | మ | జం |
| 15 | 18 | 27 | 20 | 29 | 22 | 31 | 24 |

పై దానిని 1 నుండి వరుగా అంకెలను బట్టి చదువుకొనిన గుఱ్ఱపు నడకల ప్రకారము సాగి మరి యొక శ్లోకము వచ్చును. అది ఈ క్రింది శ్లోకమగును.

"నమామి భక్తవత్సల , కృపాళు శీలకోమలం
భజామితే పదామ్బుజం, అకామినాం స్వధామదం"
ఛత్రబంధ మీ క్రింది విధము.

"ఆగే చలే బహురి రఘురాయా
ఋష్యమూక పర్వత నియరాయా"
అను పద్యాంశముతో తయారైన బంధమిది.

యా
యా రా యా
యా రా ఘు రా యా
యా రా ఘు ర ఘు రా యా
యా రా ఘు ర రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు బ హు రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు బ లే బ హు రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు బ లే చ లే బ హు రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు బ లే చ గే చ లే బ హు రి ర ఘు రా యా
యా రా ఘు ర రి హు బ లే చ గే ఆ గే చ లే బ హు రి ర ఘు రా యా

ఋ
ష్య
మూ
క

ర్వ
త
ని
య
రా
యా

ఇట్లు హిందీ సాహితీ సాగరము మథించిన యెడల ఎన్నియో చిత్రకవితామణులు కంటబడగలవు. హిందీలో ఇది చిత్ర కవిత్వ పరిచయమునకు పరిమితమైన వ్యాసము. ఈచిత్ర కవిత్వముపై పరిశోధనాత్మక వ్యాసములు విమర్శకులువెలువరింతు రని ఆశించుచున్నాను.

జి. ధర్మేశ్వరరావు ఎం. ఏ.
తిలక్ నగర్
హైదరాబాదు – 44

# అస్తిత్వవాదం - 4

## డాస్టోవస్కీ 4

విశ్వసాహిత్య రంగంలో సువిఖ్యాతుడైన రచయిత డాస్టోవస్కీ. అస్తిత్వ వాదానికి సాహిత్య రంగంలో తగిన స్థానాన్ని కల్పించడానికి, అనువైన వాతావరణాన్ని సృష్టించడానికి ఆయన రచనలు చాలా దోహదం చేసినవి. 1821లో ఆయన మాస్కోలో జన్మించాడు తండ్రి డాక్టరు. డాస్టోవస్కీ బాల్యం నుండీ తన కుటుంబమన్నా, పరిసర వాతావరణమన్నా నిర్లిప్తతగా వుండేవాడు 1837 లో అతని తల్లి మరణించింది. తల్లి అంటే ఆయనకు ఎంతో ఆదరం. ప్రేమ పూరితంగా, వాత్సల్య రసభరితంగా తల్లుల పాత్రల్ని తన రచనల్లో ఎంతో బాగా ఆయన తీర్చిదిద్దాడు వానికి అదే కారణం. మొదట సైన్యంలో చేరాడు సాహిత్య వ్యాసంగానికీ, తన సేవా వృత్తికీ సరిపోక రాజీనామా చేశాడు. ఆతరువాత అనాటి ప్రభుత్వ విధానాలను విమర్శించడం వల్ల ఏడు సంవత్సరాలు కారాగారంలో గడిపాడు. 1854లో జైలు నుండి విడుదలైనాడు. ఆయన వైవాహిక జీవితం గూడా ఆనందమయంగా గడవలేదు ఆయన భార్య చాలా కటు స్వభావం గలిగి చీటికి మాటికి సందేహిస్తూ భర్తకు చాలా మనః క్లేశాన్ని కలిగించేది. 1861లో ఆయన అన్న మరణించాడు. అన్న తాలూకు ఋణ భారం గూడా డాస్టోవస్కీ మీద పడి అతణ్ణి ఎంతగానో కుంగదీసింది. 1881 లో మెదడుకు వచ్చిన పక్షవాతం వలన ఆయన మరణించాడు.

రష్యా చరిత్రలో ఒక రచయిత మరణాన్ని జాతి రచయిత మరణంగా పరిగణించడం అదే మొదటిసారి. డాస్టోవస్కీ శవయాత్రలో వేల కొలది ప్రజలూ, అనేక వందల ప్రతినిధులూ, వందల కొలది రచయితలూ పాల్గొన్నారు. ఆశ్చర్య కరమైన విషయ మేమంటే ఆమరురోజు స్మశానాన్ని శుభ్ర పరచేవారికి ఒక్క సిగరెట్టు ముక్క గూడా కిందపడి కనబడలేదు. అ ప్రజలకు ఆ రచయిత యెడల గల గౌరవం ఆటువంటిది.

డాస్టోవస్కీ తనరచనల్లో అజ్ఞాతమైన అచేతన జగత్తును అద్భుతంగా విశ్లేషించాడు ఆయన ప్రసిద్ధ రచనలు 1. నోట్స్ ఫ్రెం అండర్ గ్రౌండ్ 2. ది పొజెస్డ్ 3. ది ఇడియట్ 4. క్రైమ్ అండ్ పనిష్ మెంట్ మొదలైనవి నోట్స్ ఫ్రెం అండర్ గ్రౌండ్ అనే పేరే ఆయిన ప్రతిపాదించిన ఆత్మగత చింతనా విధానాన్ని వ్యక్తం చేస్తున్నది. "నా లక్ష్య మంతా మానవునిపై కేంద్రిత మయి వుంటుంది, నా ప్రయత్నమంతా అతని స్వభావాన్నీ, చరిత్రనూ, జీవన పద్ధతుల్నీ, అనుభవాలనూ, ఆలోచనా విధానాలనూ, వ్యక్తీకరించడమే నన్నాడు డాస్టోవస్కీ. ఆస్తిత్వవాదులు తమ స్వరూపాన్నీ, వాస్తవిక ప్రకృతినీ తెలుసుకొనడమే మానవ జీవితం తాలూకు పరమ లక్ష్యమని భావిస్తారు.

డాస్టోవస్కీ నిరీశ్వరవాది. భగవంతుణ్ణి విశ్వసించేవాడు గాడు, ఈశ్వరుని అస్తిత్వాన్ని నిరాకరిస్తే ప్రతి వస్తువునూ మనం స్వీకరించ వచ్చునంటాడు డాస్టోవస్కీ.

మనుష్యుడు ఈ విశాల ప్రపంచంలో తనను గురించి తాను ఆలోచించుకొనడం ప్రారంభిస్తే అతని కెంతో నిరాశ కలుగు తుంది మానవుని ఆంతరిక వేదనను గురించి విన డానికీ, తెలుసు కొనడానికీ ఎవ్వరూ తయారుగా వుండరు నాగరికత, సంస్కృతి పేరుతో గూడా మానవ జీవితం ఉన్నత శిఖరాలను అందుకొనడం లేదు. మానవ జీవితమే కృత్రిమంగా తయారవుతున్నది. అంటాడు డాస్టోవస్కీ.

మనుష్యుడు స్వతంత్ర ప్రవృత్తి గలవాడు స్వేచ్ఛాజీవి. ఆ ఆధారం మీదనే అతడు తన కోర్కెల్ని లక్ష్యాలను పెంచుకొంటున్నాడు. ఆర్థిక సంపన్నత వంటి వాటినిఅతడు కోరుకొనడం న్యాయ సమ్మతమైనదే, ఒక్కొక్కప్పుడు తన స్వాతంత్ర్యానికి భంగం కలిగితే తనకు ఎన్నికష్టనష్టాలు గలిగినా వెనుదీయక దాన్ని ఎదుర్కొంటాడు అంటాడు. డాస్టోవస్కీ. కిర్కెగార్డ్ ప్రారంభించిన అస్తిత్వవాదాన్ని-మూలనున్న దాన్ని—డాసోవస్కీ సముద్రంలో ప్రయాణం చేసే ఒక చిన్న నావలోకి ఎక్కించి, దానికి "గతి" కల్పించాడనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

## కాఫ్కా 5

రచయితగా అస్తిత్వవాదానికి విఖ్యాతి కల్గించిన మరొక సాహితీ స్రష్ట కాఫ్కా. 1883లో ఆయన ప్రేగ్‌లోజన్మించాడు తండ్రి పెద్ద వ్యాపారి. కాఫ్కా న్యాయ శాస్త్రంలో పట్టభద్రుడు తండ్రి కుమారుణ్ణి వ్యాపారంలోకి దించవలెనని ప్రయత్నించాడు. కాని కాఫ్కా ప్రకృతికి అది సరిపోలేదు. తండ్రి కుమారులకు మధ్య వైషమ్యం ఏర్పడింది. 1919లో

కాఫ్కా తనతండ్రికి ఒక ఉత్తరం వ్రాశాడు. అది తండ్రికి అందలేదంటారు. అది సాహిత్య జగత్తులో చరిత్రాత్మకమైన ఉత్తరం. 1912లో ఫ్రాలిన్ అనే ఆమెతో వివాహం నిశ్చయమయింది గాని రోగగ్రస్తుడు కావడంవలన అది భగ్నమయింది 1942లో ఆయన మరణించాడు.

కాఫ్కా తన రచనల యెడల గూడా విరక్తుడే. మిత్రుల ప్రోత్సాహంవలన కొన్ని రచనల్ని ప్రచురించాడు మొదటి రోజుల్లో అవి ఎవరికీబోధపడలేదు. కాని తరువాత తరువాత అవి ప్రజాదరణ పొంది విశ్వసాహిత్యంలో గొప్పస్థానాన్ని సంపాదించు కొన్నవి. ఆయనయూదు జాతివాడు హిట్లరు ప్రభుత్వం ఆయన బంధువుల్నీ, చెల్లెళ్లనూ నిర్దాక్షిణ్యంగా చంపివేసింది. మహామారణ యజ్ఞం సాగించింది. ఆదారుణ హింసాకాండ కాఫ్కారచనల్లో ఎక్కడి కక్కడ ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఆయన కృతుల్లో 1 మెటమార్ఫసిస్, 2 ఇన్ దిఫైనల్ సెటిల్‌మెంట్, 3 ది ట్రాయిల్, 4ది కాసిల్, 5 అమెరికా మొదలైనవి ఉత్తమకృతులు. ఆయిన చాలా కథానికలు గూడా వ్రాశాడు దిట్రయల్ అనే నవలను పారిస్‌లో ఆంద్రే జీద్. జీన్ లూయిబరో ఇద్దరూ నాటకంగా మార్చి ప్రదర్శించారు ఫ్రెంచినాటక చరిత్రలో ఆప్రదర్శన అబ్సర్డ్ నాటకం పేరుతో ఒక నూతనశకాన్ని సృష్టించింది. తననవలల్లో, కథలలో ఆయన చూపించిన ప్రతిభ వలన యూరపు ఉగ్రూతలూగి పోయింది,

కాఫ్కా జీవిత ఆలోచనావిధానంలో నిరాశకు పాలెక్కువ సాహిత్యంలో నిరాశకూ, పీడకూ, వేదనకూ సాటిలేని స్థానాన్ని ఆయన రచనలు కల్పించినవి. జర్మనీభాషలో వెలువడిన ఆయన రచనలన్నీ ఈనాడువిశ్వభాషలన్నింటిలో ప్రఖ్యాతమై ఉన్నవి.

ఆయన మౌస్ అనే చిన్నకథలో యుగసత్యాన్ని వెల్లడించాడు. ఆ కథలో ఎలుక విశ్వసంకీర్ణతను అభివర్ణిస్తూ తానున్న బోనును దానికి ఉదాహరణగా చూపిస్తుంది. ఎదట వున్న పిల్లి దిశాపరివర్తనం అవసరమని బోధించి చివరికి ఆ ఎలుకనే మింగి వేస్తుంది. మనుష్యునిముందు లక్ష్యాలు, ఉద్దేశ్యాలు చాలావున్నవి. కానివాటి దగ్గరకు చేరుకునే మార్గాలలోనే యిబ్బందులన్నీ వున్నవని ఈకథబోధిస్తున్నది. అసలు మనుష్యుడు తనకు ఏది కావాలో తేల్చుకునే స్థితిలో గూడా లేడని, కాఫ్కావిచారం వక్తం చేశాడు.

బానిసత్వం భయంకరమైనదనీ, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం చాలా అవసరమనీ ఆయన బోధించారు. కాఫ్కా పాత్రలు నిరాశలో గూడా ఆశావాదులే ఎంతటి అంధకారం ముందున్నాసరే, దానిలోకి దూకడమే అవసరమని ఆయన ఎలుగెత్తి చాటాడు ఈ విశ్వం నిరర్థకమైనది. దానికేమీ అర్థం లేదు ప్రయోజనం లేదు. అయినా మానవ అస్తిత్వం ముందుకు సాగక తప్పదు. సాగుతుంది నిరాశలూ, నిస్పృహాలూ, తప్పవు. ప్రయత్నించి ముందుకుసాగు అంటాడు కాఫ్కా.

## కామూ 6

అస్తిత్వవాద పరంపరలో కామూ చివరి వాడనవచ్చును. అస్తిత్వవాది అనే దాని కంటే కళాకారుడు అనే శబ్దం ఆయనకు చాలా ఇష్టం. సమాజంలోని విసంగతులనూ, అసంగతులనూ బాగా అర్థం చేసుకుని మానవ సమాజ రక్షణకు అనువైన ఆసిద్ధాంతాలను ఆయన తనరచనల ద్వారా వెలువరించాడు.

1913లో అల్జీరియాలో ఒక గ్రామంలో జన్మించాడాయన.బీదకుటుంబం.అతని ఒకటోసంవత్సరం వయస్సులోనే తండ్రి మరణించాడు తల్లిది రోగిష్ఠిశరీరం. గ్రామంలో వైద్యసదుపాయంలేక పోవడం వల్ల, బీదతనం, రోగాల వల్ల ఆతల్లి పడినబాధా, మధ్యమధ్య చేసిన అసంబద్ధ ప్రలాపాలూ కామూ రచనల్లో మనం తరచు చూస్తాము. పిల్లల సంరక్షణ ఆతల్లికి పెద్దసమస్య అయిపోయింది. అయినా ఏవిధంగానో ఆమె నెట్టుకొచ్చింది, అల్జీరియా విశ్వవిద్యాలయంలో దర్శనశాస్త్రం అధ్యయనం చేస్తున్న రోజుల్లోకామూ క్షయవ్యాధి గ్రస్తుడైనాడు చదువుమానివేయవలసివచ్చింది. అతని ఇరవయ్యోఏట వివాహం జరిగింది, అది ఒక్క సంవత్సరంలోనే భగ్నమయింది 1957లో ఆయనకు నోబుల్ బహుమతి లభించింది. 1960లో చిన్నవయస్సులోనే ఒక మోటరు దుర్ఘటనలో ఆయన మరణించాడు.

కామూ సాహిత్యస్రష్ట పెద్దవిమర్శకుడు గూడా కామూ వ్రాసిన ఉద్గ్రంథాలు చాలా వున్నవి. వాటిలో 1ది మిత్ ఆఫ్ సిసిఫస్ 2 రెసిస్టెన్స్ 3 రెబెలియన్ 4 ది అవుట్ సైడర్ 5 ది ప్లేగ్, 6 ది ఫాల్ మొదలైనవి చాలా ప్రసిద్ధమైనవి. ఆయన వ్రాసిన చిన్న కథలు చాలావున్నవి. ది హేపీడెత్ అనే చిన్నగ్రంథం విచిత్రమైనది. దానిలో రెండు భాగాలున్నవి ఒకటి నేచురల్‌డెత్, రెండోది కాన్షన్‌డెత్. మృత్యువు స్వరూపాన్నీ, పరమార్థాన్నీ ఆపుస్తకంలో బాగా చిత్రించాడు కామూ.

విసంగతులమయమైన ఈ ప్రపంచంలో అభిశప్తుడుగాను, ఏకాకిగాను వున్న మానవుని కరుణ కథా, వేదనా, కామూ సాహిత్యానికి కావ్యవస్తువులు, ఆయన రచనలు అబ్సర్డ్ థియేటర్ నిర్మాణానికి బాగా దోహదం చేసినవి బెకెట్, అయనెస్కో వంటి నాటక రచయితలకు ఎంతో ప్రేరణ కలిగించినవి. జరిగిన ప్రపంచయుద్ధాలు రెండూ, ఆయుద్ధాలకు పరిణామంగా ఏర్పడిన భయంకర పరిస్థితులూ మనుష్యుణ్ణి పరాజితుణ్ని చేయడమే గాక అంతవరకు మనమేర్పరుచుకున్న సనాతన మానవత్వపు విలువల్ని ఛిన్నాభిన్నం చేసి వేసినవి. దానితో ఆదర్శాలయెడల మానవునికున్న పవిత్రతా భావమూ, విశ్వాసమూ సడలిపోయింది. మనుష్యుడు ఈనాడు ఏకాకి. శాపగ్రస్తుడు. పురుషార్థం, ఆదర్శం, లక్ష్యం న్యాయం, వంటి ఆధారాలేమీ అతనికిలేవు అతడు త్రిశంకుగా తయారైనాడు అతని నలుమూలలా విసంగతుల మయమైన జగత్తున్నది, ప్రజాస్వామ్య మనీ, స్వాతంత్ర్య మనీ చేస్తున్న చర్చల్లో సారమేమీ కనబడడంలేదు. మానవత్వపు విలువల్ని గుర్తిస్తున్న వ్యవస్థ ఏదీ లేదు. ఎక్కడ చూచినా అసంగతులే బూటకపు నినాదాలే. ధర్మం లేదు న్యాయం లేదు. ఇదీస్థితి జీవితంలో చిన్న చిన్న విషయాలలో గూడా ఎక్కడ చూచినా విసంగతులే ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయంచేసి ఆ నిర్ణయాన్ని అనుసరించి పథకం తయారు చేస్తాము. కాని జరుగుతున్న దేమిటి? ఆ పథకం ఫలించడం లేదుసరి గదా, తర్కహీనమైన, యుక్తి హీనమైన, లక్ష్యహీనమైన పనులు జరుగుతున్నవి మనమేర్పర్చుకొన్న విలువలూ, యుక్తిసంగతమైన నిర్ణయాలూ ఎందుకూ కొరగాకుండా పోతున్నవి మన సరైన ఆకాంక్షలకూ బయట జరుగుతున్న అవివేకపు పనులకూ, అనుభవాలకూ ఎక్కడా లంగరందడం లేదు. ఈ స్థితిని కామూ ఆబ్సర్డ్ విసంగతి అంటాడు ఆయన నిర్మించిన సిసిఫస్ ఈ విసంగతుల దర్శనానికి ప్రతినిధి నాయకుడు.

ఈ విసంగతుల నుండి తప్పుకోవడమెలా? రక్షింపబడేదెలా? దానికి రెండే రెండు ఉపాయాలున్నవి ఒకటి ఈశ్వరుని శరణు జొచ్చడం. రెండోది మృత్యువును ఆశ్రయించడం. కాని ఈ రెండు ఉపాయాలూ నిరర్థకాలే. ఈశ్వరుని శరణు జొచ్చడమంటే ఒకరకంగా మెటఫిజికల్ మృత్యువును వరించడమే అవుతుంది. ఇక మృత్యువును ఆశ్రయించడమంటే విసంగతులకు తలవొంచడమే.

అందువలన మనం ఏమి చేయాలి? కామూ తిరుగుబాటు చేసి అంటాడు. అదే రెబెలియన్‌లో వివరించాడు. విసంగతుల పరిధిలోనే వుండి. మనం నూతన విలువల్ని ఏర్పర్చుకోవాలి. విసంగతుల మధ్యవుండి తిరుగుబాటు చేయడం గూడా కష్టసాధ్యమే అయినా ఆత్మాభిమానంతో మృత్యువును ఆశ్రయించక, ఆత్మార్పణం చేయక, పరిస్థితికి తల వంచక తిరుగుబాటు చేయమంటాడు కామూ అదే సత్యసిద్ధికి మార్గ మంటాడు కామూ.

విప్లవం వేరు. తిరుగుబాటు వేరు, ఈ రెండింటిలోని వ్యత్యాసాన్ని కామూ చాలా బాగా వివరించాడు.

కామూ ప్రతిపాదించిన తిరుగుబాటు సిద్ధాంతం వ్యక్తిగత వ్యవహారాలలో ఫలప్రదమైనా సామాజిక పరిధిలో ఫలప్రదం గావడం లేదు. సమష్టి గతంగా ఈ సిద్ధాంతం సఫలం కావడం లేదనే విషయాన్ని కామూ గుర్తించాడు. ఒక జర్మన్ మిత్రునికి ఉత్తరం వ్రాస్తూ దానిలో ఈ విషయాన్ని వర్ణించాడు.

కామూ నిరాశను గాక విశ్వాసాన్ని సమర్థిస్తాడు. ఎట్టి పరిస్థితి ఏర్పడినా, ఎన్ని అసంగతులు, విసంగతుల మధ్య కొట్టు మిట్లాడుతున్నా "అహం"ను రక్షించుకొంటూ జీవించి వుండాలి, సంఘర్షించాలి, తిరుగుబాటు చేయాలి అంటాడు కామూ కామూ గొప్ప రచయిత దార్శనికుడు. అస్తిత్వవాదానికి సాహిత్య రంగంలో ఎనలేని ప్రాముఖ్యాన్ని తెచ్చిపెట్టినవాడు.

అస్తిత్వవాద దార్శనికులలో దాదాపు ఆచార్యులు చాలామంది సిద్ధాంత పరంగా గ్రంథ రచన చేసిన వారున్నారు. హైడ్‌గర్, హసరేల్ నిట్చే వంటి వారంతా మహా పండితులే. అయినా సాహిత్య రచనల్లో అస్తిత్వవాదానికి, ఆదర్శవాదానికి ప్రముఖస్థానం కల్పించినవారు కొంతవరకు డాస్టోవస్కీ, సంపూర్ణంగా కాఫ్కా, సార్త్రె, కామూలు అనడం నిర్వివాదాంశం.

వేమూరి ఆంజనేయశర్మ
హైదరాబాదు

# సహృదయైక వేద్యమైన "సాగరసమీరాలు"

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు రచించిన "సాగర సమీరాలు" సాహిత్య చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించిందని చెప్పవచ్చు. ఇందులో కొన్ని వచన గేయాలు వున్నాయి. వీటి స్వరూప స్వభావాలు తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన కవితా మార్గాన్ని ప్రారంభించాయని చెప్పటం నిస్సందేహం.

బెజవాడ గోపాలరెడ్డి గారు సుమారొక అర్థశతాబ్దం నుండి కవితా వ్యాసంగాన్ని ప్రారంభించారు. అంతకుముందు అనువాదాలు వచన కావ్యాలు కొన్ని రచించారు. రవీంద్రుని బెంగాలీ కృతులు తెలుగు లోనికి తెచ్చారు. రవీంద్రుని నాటికలను (5 పుస్తకాల సంపుటిని) ప్రచురించారు. 'కథలు-కల్పము' అనేది మరో పుస్తకం వాన చినుకులు, ఊర్వశి కాళిదాసు నైవేద్యము-స్మరణ, తాజ్‌మహల్-యిత్యాదులు కూడా అనువాదాలే. ఇవిగాక ఇక్బాల్ కవితలను ఉర్దూ నుండి కూడా అనువదించారు.

ఇదిలావుండగా స్వతంత్రగ్రంథాలు 1976నుండి ప్రారంభమైనాయి 'ఆమెపంచకము' అను పేరుతో 1978 నుండి 1982 వరకు 5 పుస్తకాలు వెలువరించారు ఇందులో ఆమె ఆమెజాడలు' ఆమెనీడలు, ఆమెతళుకులు, ఆమెచెణుకులు అనే పుస్తకాలున్నాయి.

ఇవికాక వచన కవితా సంకలనాలు మరోఅయిదు కూడా వెలువరించారు అవి కాలవాహిని, సాహిత్యసుందరి, ప్రసూనమంజరి, పరిమళతరంగాలు, సాగర సమీరాలు అనేవి ఈ పుస్తకాలన్నింటిలోనూ తెలుగు సాహిత్యం స్పష్టంగా మరొక మలుపు తిరిగింది.

ఇలా అనడానికొక కారణముంది. గోపాలరెడ్డిగారికి బెంగాలీ భాషలో, ఉర్దూలో, హిందీలో తెలుగుతో సమానమైన పాండిత్యం వుంది. ఇవి కాక ఇంకా కొన్ని భాషలు వచ్చు, ఆ కారణంచేత ఆయాభాషల స్వరూపస్వభావాలను, అందలి కవితా సౌందర్యాలను, సౌరభాలను ఆఘ్రాణించి, అస్వాదించి వానిని తమలో జీర్ణంచేసుకున్నారు. సుదీర్ఘమైన అరు దశాబ్దాల సాహిత్య, రాజకీయ, సామాజిక జీవితం తర్వాతభావ పరిపక్వతను పొంది కవితారంగంలోకి అడుగు పెట్టారు అందుచేత కాబోలు ఇందులోని భావాల్లో పరిపూర్ణత, తాత్త్వికత దోబూచులాడుతూ వున్నాయి. ఒక మహామనీషి సుదీర్ఘ యాత్రలో పొందిన అనుభూతులవి నిలిచిన ఒయాసిస్సులు. చేతబట్టిన పాథేయం రసజ్ఞులకు ఉపాదేయం. వారిమాటల్లోనే చెప్పాలంటే ఇవి వేర్వేరు పువ్వులతో కట్టిన పూలచెండ్లు. బొట్టుబొట్టుగా కురుస్తున్న వానచినుకులు. భావబిందువులు బెజవాడవారి నెల్లూరులో "ధారలుగా కురిసిన వానజల్లులు, భావస్రోతలు. వారి సాహిత్య వనవీధులలో వెలుగును చూచిన పుష్పమాలలు.

సాగర సమీరాల్లో శతాధికమైన దీర్ఘకవితలకృషి పంటకుప్ప నూర్పుకు సిద్ధంగా వుంది శ్రీస.జీవదేవ్ మాటల్లో చెప్పాలంటే. "ఈకవి రచించిన ఈ మొదటికవితా సంపుటిలో కవి మానససరోవరంలోలేచే భావతరంగాలతో పోటీచేయలేక పోతుంది కవితాశిల్పం. తరువాత వెలువడిన గ్రంథాలలో ఈతారతమ్యం తగ్గిపోయి, విషయానికీ మధ్య ఒక సమత స్థిరపడింది.

సందేహంలేదు. చిత్రరచనలో రూపంప్రధానం, భావంతరువాతది. కవితా రచనలోమాత్రం భావంప్రధానం. రూపం తరువాతది. కవితలో ముఖ్యంగా రూపప్రాధాన్యం కన్పించక భావప్రాధాన్యత కనిపించినాకూడా నిదానంగా భావం, ఆ భావనలోకి కరిగిపోతుండగా రూపం ప్రస్ఫుటం కావటం ప్రారంభిస్తుంది అందువల్ల భావకవిత అనేదానిలోను, వచన కవిత అనేదానిలోను కవితాశిల్పం నగణ్యం కాదు.

రెండవది అయిన "ఆమె" అనే గ్రంథంలో కవితా శిల్పం రమ్యంగా ప్రకాశించింది. ఇందులోని కవితలన్నీ కూడా మృదువైన వియోగ శృంగారం, కోమలమైన విరహశృంగారానికి చెందినవి ఇందులో ఉర్దూ కవితల్లోని భావాలు, బెంగాలీకవితల్లోని ప్రభావాలు, రవీంద్ర, ఇక్బాల్ గాలిబ్ మొదలగువారి గేయాలకు ఛాయానువాదాలుగా రూపొందినాయి. ఈ ప్రేమ కవితల్లో పారశీక కవితాగానం తగులుతుంది. ఆయా భావాల ప్రభావాల ప్రేరణ వల్ల రచించిన కొన్ని మౌలిక తెలుగు కవితలుకూడా ఉన్నాయి." ఇదే గోపాలరెడ్డిగారి విశిష్టత.

తెలుగులో ఇప్పటివరకు కవిత్వం వ్రాసినవారిలో సంప్రదాయజ్ఞులంతా సంస్కృత సాహిత్య మర్యాదలను

పాటించేవారు. వారిపై సంస్కృతంయొక్క ప్రభావంఎక్కువగావుండేది. మరికొంతరు ఆధునికులు అటుహిందీనో, ఇటు ఇంగ్లీషునో ఆశ్రయించేవారు ఇలా కాక ఉర్దూకవితలునయథాతథంగా చెప్పిచెప్పక అనువదించినవారుకూడా వున్నారు.

శ్రీ గోపాలరెడ్డి స్పష్టంగా బెంగాలీనుండి లేదా ఉర్దూనుండిచేసిన అనువాదాలు చెప్పారు. కాని వారి కవితా స్వరూపం వేరు. ఇవి అనువాదాలు అనడంతగదు. అనుసరణలు కూడా కాదు. సుదీర్ఘమైన తమ సాహిత్యజీవితంలో పొందిన తమ అనుభూతులను నెమరు వేసుకున్నప్పుడు అందుండి వెలువడిన భావతుషారాలివి ఆయా భాషలకవితా సంప్రదాయాల నన్నింటినీ పుక్కిట బట్టిన తర్వాత వారు వెలువరించిన భావశీకరాలివి కొన్నివేల కవి సమ్మేళనాలు, సాహిత్య సమావేశాలుచూచి ఆధ్యక్షత వహించి ఈశతాబ్దంలోని ప్రముఖులందరి కవితలు, సాహిత్యోపన్యాసాలు విని, అందలి సారాంశమంతా జీర్ణంచేసుకుని, తనదైన స్వంత గొంతు గోపాలరెడ్డి ఏర్పరచుకున్నారు. వీనిలో భావాలు గగనాన్ని చుంబిస్తూవుంటాయి రూపం (Form) వాటితో పోటీపడదు. ఈ కారణంచేత సామాన్యులకు ఇందలి కవితా సౌందర్యం అర్థంకావటం పైచూపులకు కష్టమైతే కావచ్చు ఆకారణంచేతనే ఎవరైనా దీనిని విమర్శించవచ్చు అర్థం చేసుకోలేక పోయినా చేసుకోలేక పోవచ్చు. ఇది చాలాముఖ్యమైన విషయం.

శిల్పి తన ఉలితో ఒక బొమ్మను చెక్కినట్లు గోపాలరెడ్డిగారు చెక్కుతూ కూచోలేదు. భావతరంగాలతో ప్రవహించే జీవనదిలా ఈ రచనలు సాగుతూవుంటాయి. దాని ఒడ్డున నుఱుగు, చెట్లు ఉండవచ్చు కాని ఆదలని శిల్పం కన్న చలద్రూప నదీప్రవాహం ఎలాంటిదో సహృదయులు గ్రహించవచ్చు. ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసులంతాకూడా కవిత్వంలో భావానికి ప్రాధాన్యమిచ్చి రూపాన్ని గౌణంగా స్వీకరించారు, భావవ్యక్తీకరణమే కవిత్వమని షెల్లీ అన్నాడు. రసభావ భావనలయొక్క శబ్దరచనయే కావ్యమని హాజ్‌లిట్ అన్నాడు. Poetry we will call musical thought అని కార్లైల్ అన్నాడు.

Poetry is the antithesis of science having for its immediate object pleasure not truth అని కాలరిడ్జ్ వ్యాఖ్యానించాడు. అలాగేప్రాచ్య విద్వాంసుల్లోకూడా, విశ్వనాధ, జగన్నాధ, పండితాదులు ఎన్నో నిర్వచనాలు చేశారు వీరందరిసారాంశము ఒక్కటే రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్యము అంటే అర్థం– అర్థరమణీయకత్వానికి ప్రాధాన్యమీయటం గమనించాలి.

''చేతులు ఒకటైనప్పుడు
వందనం
వేరైనప్పుడు
కౌగిలి''

గోపాలరెడ్డిగారి ఈకవితలో ఎంత మాధుర్యముందో వ్యాఖ్యానించటం మనవసరం అల్పాక్షరాలతో అనల్పార్థ రచన మనకిందులో కనబడుతుంది. ఉర్దూ కవితల్లోని ముక్తక ధర్మం ఇందులో వుంది అమాటకొస్తే ఇలాంటివి కూడా ఉర్దూవారి సొత్తేమీకాదు గాధాసప్తశతినాటి ముక్తకాలు ఇలాగే వుంటాయి.

''గేహ్ణాహపలో అహ ఇమం పహసి
అవఅణా సఇప్ప అప్పేఇ
జా ఆసు అపఢముబ్భిణ్ణద న్తఙు।
ఆలజ్కి ఆం బోరం

(భార్య క్రొత్తగా వచ్చిన పళ్ళతో కుమారుడు కొరికిన తన బుగ్గను నవ్వుచూ "ఇదిగో చూడండి" అని భర్తకు చూపుతున్నది.)

ఏకోవికష్ణసారోణ దేఇగన్తుం పఅహిణవలన్తో
కిం ఊణ బాహ ఉలిఆంలో అరాఙుఅలం పిఅఅమా
(ఒక్క లేడియే కుడినుండి ఎడమకు తిరిగిన, ప్రయాణము జరుగదు. అట్టియెడ రెండు మృగములు తిరిగినచో ప్రయాణ మెట్లగును)

''మహమహఇ మలఅవాఓఅత్తావారేఇమంగుథాణే స్తిం
అజ్కోల్ల పరిమళేణవిజోక్షుమఓ సోమ వ్వేఅ''

మలయపవనము తహతహ చెందించుచున్నది అత్తగారు ఇంటినుండి బయటకుపోనిచ్చుటలేదు. ఇంటిముందు గల అశోకవృక్ష పరిమళము చంపివేయుచున్నది)

''పజ్జర సారింఅత్తాణసేసికిం ఏత్థరఇహరాహిన్తో
వీసమ్భజమ్పిఆఇం ఏసా లోఅణంప ఆదేఇ''

(అత్తా! రతిగృహము నుండి ఈ పంజరములోని చిలుకను మరియొకచోటికి ఏలమార్చవు ? రహస్యముగ అనుకొనిన మాటలను ఇది లోకమునకు చాటుచున్నది.)

''వణ్ణక్కమరహిఅస్సవిఏసగుణోణవరి చిత్తకమ్మస్స ఊథో''

(రంగులులేక కేవలము గీతలతోనేవున్న చిత్రము నందు సహితము ప్రియుడు ప్రియను ఒక్కనిమిషమైనను వదలుట లేదు.)

''అహ సా తహిం తహిం వ్విఅ
వాణీరవణమ్మి చుక్కసంకేఆ।
తుహ దంసణం విమగ్గఇ
పబ్భట్ఠణి హాణిఠాణంవ''

(ఆమె ఆనవాలు మరచి పాతిపెట్టిన స్థలమును మరచిన వానివలె ఆవెదురు పొదలలో నిన్ను అడుగడుగునను వెదకుచున్నది)

శ్రీగోపాలరెడ్డి గారి ముక్తకాలు ఏవీకూడా ఈ ప్రాకృత సాహిత్య వైభవానికి తీసిపోయేవికావు. అలాగే మరొక కవిత చూడండి.

''ఆమె నాయింటికి
వస్తానన్నది
రాకముందు
వర్షించకు
వచ్చినపిదప
విరమించకు'.

ఈ ముక్తకంలోని భావమాధుర్యం సహృదయైక వేద్యం. మరొకకవిత చూడండి.

''తపిస్తూ, ఇళ్ళువదలి
డొంకల పాలయ్యాను.
కొన్నినాళ్ళకు ఇంటికివస్తే,
డొంకలే మెరుగుగా వున్నాయి.''

విశ్వనాధవారు తమ ముక్తకాలలో ఒక కవిత వ్రాశారు.

''ఊరివారలెల్ల రాలోచనముచేసి
మంచమ్ముతోడనిడిరి స్మశానమునను
అటపిశాచకాంతలాలోచనముచేసి
మరలతెచ్చి ఊరిమధ్యనిడిరి''

ఒక ఊరిలో ఒక గయ్యాళి వుంది. ఆమె బాధను ఊరివాళ్ళు భరించలేకపోయారు. అందుకని ఆమె నిద్రపోయేటపుడు రహస్యంగా ఆమెను మంచంతోసహా తీసుకొని పోయి స్మశానంలో వదిలిపెట్టి వచ్చారు. అయితే అక్కడి దయ్యాలు ఆమెను చూచి భయపడ్డాయి. అందుకని మాట్లాడకుండా ఆమెను మంచంతోసహా తీసుకుని వచ్చి మళ్ళీనగరంలో వదిలిపెట్టి పారిపోయారు—ఈ కవితలోఆమె గయ్యాళి అనేమాట ఎక్కడా వాచ్యం చేయబడలేదు, ఈ వ్యంగ్య ధర్మమే ఈ కవిత్వాన్ని ఆకాశమంత ఎత్తుకు తీసుకుని వెళ్ళింది. శ్రీగోపాలరెడ్డిగారి కవితలో ఇలాంటి సౌందర్యమే కనపడుతున్నది. ఒక వ్యక్తికి ఇల్లునచ్చలేదు, ఆది వదిలి డొంకల పాలైనాడు. ఆ డొంకలూ నచ్చలేదు, అందుకని ఇంటికి తిరిగివచ్చాడు తీరా ఇంటికివచ్చిచూస్తే ఇంటికన్నా డొంకలే బాగున్నట్లనిపించాయి అంటే డొంక నుంచివచ్చాక వాటికన్నా ఇంటిపరిస్థితి అధ్వాన్నంగావున్నట్లు కనపడింది. ఇదీ ఇక్కడి సౌందర్యం. ఇదీ ఇక్కడి చమత్కారం ఇలాంటిదే మరోచమత్కారం చూడండి.

''ఆమెనుండి జాబువచ్చింది
తపాలా బంట్రోతుకు ఇనాంఇచ్చాను
తెరచి, చదివితే
చివాట్లుపెట్టి తిట్టింది.''

ఇలాంటి ముక్తక సౌందర్యాలు గోపాలరెడ్డిగారిలో కోకొల్లలు.

''చంద్రుని నీడ
అమావాస్య దేహముపై పడితే
సూర్యగ్రహణ మగుతుంది.
భూమినీడ
పౌర్ణమివదనముపై పడితే
చంద్రగ్రహణమవుతుంది.
ఆమె వలపునీడ
నామీదపడితే
కరగ్రహణ మవుతుంది.
వికసిస్తే
పాణిగ్రహణ మవుతుంది.''

ఇందలి మాధుర్యం సహృదయైకవేద్యం. కవిత్వంలోనేకాదు గ్రహణం, కరగ్రహణం వంటి పదాల్లో కూడా...

సుదీర్ఘమైన జీవితానుభవం తర్వాత గోపాలరెడ్డిగారి తాత్త్విక భావాలు అంబరాన్ని చుంబించాయి. మావూరి చెట్టు

వంటి లోగడ వ్రాసిన ఖండికలు వారి ఆధ్యాత్మికత్వానికి అంతర్దృష్టికి ఎత్తిపట్టిన జయపతాకలు.

"ఒకటిలో సృష్టిలేదు
అద్వైతంలో సృష్టిలేదు
'ద్వైతం' కావాలె
కనీసం రెండు కావాలె.
మగ ఆడ కావాలె
రెండు మగలలో సృష్టి లేదు
రెండు ఆడలలో సృష్టిలేదు,
మగఆడలద్వైతంకావలె
దాన్నే పురుషుడు, ప్రకృతి అన్నారు."

ఉపనిషద్రచనలా వుందికదూ ఈ కవిత.

ఇందులో "సుబ్బవ్వ అరుగు" అని ఒక ఖండిక వుంది పల్లెటూళ్ళో సుబ్బవ్వ అనే ముసలామె వుంది. ఆమెకు 77 యేండ్ల జ్ఞాపకాలు వున్నాయి. అవన్నీ ఆమె వూరివారికి చెప్పేది. కొంతకాలానికి ఆమె చనిపోయింది దానితో—

"అలిఖిత ఇతిహాసానికి కంఠముపోయినట్లుండింది
తాతల ముత్తాతల చరిత్ర బూదిదలో కలిసింది.
ఊరిపెద్దను కోల్పోయి
ఆమె స్మృతిగగనములో ఎగురుచుండిన
పెద్దల కీర్తులనే పోగొట్టుకున్నారు
గతములేని వర్తమానమైనదిగ్రామము
వేరులమరచిన చెట్టుమోడైంది గ్రామం
మళ్ళీదొరకని గతచరిత్రంతా కొట్టుకుపోయింది
వెనుకటి కథలను దాచిన కాలపేటికపోయింది
పాతజ్ఞాపకాల మర్రిచెట్టు విరిగిపడిపోయింది.
మిగిలింది సుబ్బవ్వ కథలు, సుబ్బవ్వ అరుగు
పొగడచెట్లుపెరిగి పువ్వులు రాలుస్తుందేవి
సురభిళ స్మృతికళికలుగ
ఇతిహాసదేవి ఆహ్లాద రసగుళికలుగ"

హృదయాన్ని కరిగించే రసార్ద్రిత ఈ పంక్తుల్లో గోపాలరెడ్డి నిక్షిప్తంచేశారు అలిఖిత ఇతిహాసానికి కంఠం పోవడం, పాతజ్ఞాపకాల మర్రిచెట్టు విరిగిపోవడం, గతం లేని వర్తమానంగా గ్రామం మారడం, మళ్ళీదొరకని గత చరిత్ర అంతా కొట్టుకుపోవడం..."ఎంత అపూర్వంగా వున్నాయి. ఈ ప్రయోగాలు, "పొగడచెట్లు పెరిగి పువ్వులు రాలుస్తుందేవిట సురభిళ స్మృతికలుగా, ఇతిహాసదేవత ఆహ్లాద రస గుళికలుగా ' సుబ్బవ్వ అరుగు మీద. ఎందు కంటే ఆచెట్టు ఆమె కథలన్నీ విన్నది కాబట్టి. అంటే కవి సుబ్బవ్వకు ఈకవితలో పుష్పాంజలి సమర్పిస్తున్నాడని అర్థం.

కవి. వేదాంతి ఒకేకొమ్మకు పూచిన రెండుపూలు అంతరంగుడైతే వేదాంతి. అంతరమైన సత్యాలను బహిర్ముఖం చేసేదికవి. సాగరసమీరాల్లో మనకొకకవి, వేదాంతి కనపడుతున్నాడు. ఇదింత మధుర సంగమం. కవిత్వానికిదే కొలబద్ద. ఉత్తమజాతి కవిత్వం సహృదయ పాఠకునికి అనుభవైకవేద్యం. సాగరసమీరాలు సౌందర్యరసాప్లావితమైన తాత్త్వికకావ్యం. అది గ్రహించాలంటే ముందు పాఠకుడు సహృదయుడై యుండాలి సుమా!

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్
ఎం. ఎ. పి. హెచ్. డి.
2-2-647/182. B
సెంట్రల్ ఎక్సేంజ్ కాలని
హైద్రాబాద్. 13.




## ఊర్వశి

రచన-పొట్లపల్లి సీతారామారావు
వెల-రూ. 6 = 00
ప్రతులకు-రచయిత పేర
ఆనందభవన్. రైల్వేడపలైను
మారుతీనగర్, విజయవాడ-520 004.

ఇది ఒక పద్య కావ్యం. కృతికర్త సీతారామారావు గారు కవిగా, విమర్శకులుగా పేరు గడించినవారు. కొన్నేళ్ళ క్రితం రాయప్రోలు, దేవులపల్లి, వేదుల మొదలైన భావ కవుల కవితా వైశిష్ట్యాన్ని గూర్చి భారతిలో వ్యాసాలను ప్రకటించారు. దీన్ని బట్టి వారికి భావకవుల సాహిత్యమంతా కొట్టిన పిండి అని భావించవచ్చు. భావకవుల కవిత్వాన్ని నిండుగా జీర్ణించుకున్న సీతారామారావుగారిని తత్ ప్రభావం ఈ 'ఊర్వశి' కావ్య రచనకు ప్రేరేపించిందేమో అనే ఊహ కలుగకపోదు.

ఊర్వశిని మొట్టమొదట సాహితీ రంగంలో కవితా స్వరూపంతో ప్రవేశ పెట్టింది కాళిదాసు. అతడు "విక్రమోర్వశీయమ్" అనే నాటకం వ్రాసినాడని అందరికీ తెలిసిందే. ఆధునిక యుగంలో తొలుత ఊర్వశిని గురించి కావ్యం వ్రాసింది రవీంద్రుడు, తెలుగులో కృష్ణశాస్త్రి. మళ్ళీ నేడు సీతారామారావుగారు ఊర్వశిని గూర్చి ఈ రసవంతమైన కృతిని సంతరించారు. "ఉరు అధికం వష్టి ప్రకాశిత ఇతి వశకాంతే-అన్నవ్యుత్పత్తి నా హృదయము నాకర్షించినది. ఊర్వశి ఒక కాంతిమూర్తి. తన్మూర్తి భావనలో పరబ్రహ్మ స్వరూపిణిగా గోచరించినది నాలోనొక యుత్కంఠరేకెత్తించినది" అని కవి 'ఒక్కమాట'లో చెప్పుకున్నారు. అంతేకాక "పరమాత్మలో నంతర్లయించుటకు జీవుడు పొందెడి యుత్కంఠయందలి ప్రధాన వ్యంగ్యము. పురూరవునిగా నారోపించుకొనిన కవి స్వీయ వేదనానుభవము ఇందు వాచ్యార్థము" అని కూడా తెలిపారు.

ఈ అంశాలను బట్టి చూస్తే కవి ఈ కావ్యాన్ని ఏ ఆశయంతో రచించారో సులభంగా గ్రహించవచ్చు.

కవి ఈ కావ్యంలో కథకుగాక రసానికి ప్రాధాన్యం ఇచ్చారు. ఆ రసం శృంగారం. పైగా విప్రలంభ శృంగారం. సీతారామారావుగారికి శృంగార రసమంటే మిక్కిలి మక్కువ అని ఈ క్రింది పద్యాన్ని బట్టి తెలుసుకోవచ్చు

"పరమాహ్లాద మధురమై పరగురసము
గాన శృంగారమే యలంకారికులకు
ప్రథమగణ్యమై కావ్యాల బరగెదాని
తెరువుబడి పోవు వారు వందితులు జగతి"

ఈ 'ఊర్వశి' కావ్యమంతా శృంగార రసతరంగితమై రమణీయంగా సాగింది.

ఊర్వశీ శబ్ద గతమైన యుజ్వలమ్ము
వెలుగు నొక మహామూర్తిగా దలప దాని
లో పర బ్రహ్మ దివ్య స్వరూప మొలసి
హృదయ మూగింప కావ్యమై బొదలెనిట్లు"

అంటూ కావ్యంలో ఊర్వశిని పరబ్రహ్మ స్వరూపిణిగా, తాను జీవాత్మగా భావిస్తూ కృతిని సరసరీతిలో సాగించారు. శబ్దగత మాధుర్యమూ, అర్థగత సౌంద్ర్యమూ సమంగా సమ్మేళనం పొంది కావ్యం కమనీయాకృతితో రసజ్ఞులకు దర్శనమిస్తుంది. పరమాత్మలో ఐక్యమొందుటకై జీవాత్మ పడు ఆవేదన పలుతావుల ధ్వని మంతముగా ప్రదర్శింపబడినది. కవిత అంతా రస ప్రవాహ భరితంగా నడిచింది. ఇందులో చమత్కారంగా ఋతువర్ణన కూడా చేయబడినది.

ఈ కావ్యంలోని హృద్యమైన పద్యరచనా రీతికి ఒకటి రెండు ఉదాహరణలు

"గాలి యలు వెన్నెల గలిసియాడు
వేళ గజ్జియ రవళి విన్పించి పాద
చాలనా వేళ నృత్య సంచారి, సన్న
తాంగి యూర్వశి నాకు ప్రత్యక్షమయ్యె"

"నీ కను బొమ్మవంపు, తరు
ణీ! నను వంచెను నేలవాటుగా
ప్రేకము దీర్ఘ వేణి మెలి
వెట్టెను నా హృదయాంతరాళమున్
ఓకమనీయ నీల మహి
తోజ్జ్వల బంభరవేణికా! యదృ
శ్యా కృతివైతి, కోప వివ
శాంగివి, నీ తొలు సంజప్రొద్దులన్"

సాహిత్యరస పిపాసవులు చదవదగిన మంచి కావ్యం ఊర్వశి.

## సైబపద చిత్రాలు

రచన-సైబ పరంధాములు
వెల-ఎనిమిది రూపాయిలు
ప్రతులకు-ఇందూరు భారతి
నిజామాబాదు.

ఆధునిక యువకవులు కొందరు ఆలోచనాత్మకమైన కవితను వ్రాస్తూ సాహితీ పరుల మెదళ్ళకు పదును పెడుతున్నారు. సామాజికావగాహనతో, కొత్త భావాలతో కవితకు కొత్త రూపు దిద్దుతున్నారు. నూతన పద చిత్రాలతో సాహిత్య పాఠకుల కండ్లకు మిరు మిట్లు గొలుపుతున్నారు. ఐతే ఈలాంటి కవితల్లో కొంత అస్పష్టత చోటు చేసుకొని చదువరుల తికమక పెడుతున్నది.

శ్రీ సైబ పరంధాములు చిత్రకారుడు కూడా కావడంవల్ల అతని కవితల్లో రకరకాల, రంగు రంగుల పద చిత్రాలు రూపుగట్టినాయి. అక్కడక్కడ నైరూప్య చిత్రకళ మాదిరి అస్పష్ట రూపాలు దర్శనమిస్తాయి. ఐనా చాలా కవితలు సుస్పష్టరేఖలతో ఆ యాదృశ్యాలను కండ్లకు కట్టిస్తున్నాయి.

"ఆకర్షణలేనికళ్ళల్లో ఎన్నిఆలోచనలు అనుమానాలూ-బాధలూ భయాల్నిపంచుకొని ఈమంచాలు విశ్వసించేమూలుగులు కదలనికాళ్ళపై కదిలేరోగం నీడలు ఆవేదల్ని ఆరేసే పంకాలు స్తంభించినకాలం ఆగోడపై"

(ఆసుపత్రి)

ఈ కవిత ఆసుపత్రిలోని దృశ్యాలను కండ్లముందు నిలుపుతున్నది. మనసు రక్తసిక్తమైన గతాన్ని జ్ఞాపకం చేసుకొనిబాధపడాన్నికాక భవిష్యత్తును దిద్దుకోవడాని కని మనస్సును ప్రబోధిస్తున్నాడు కవి.

"అవహేళనలకు చిరిగిన మనస్సును మౌనంతో కుట్టుకుంటూ అపవాదుల గుండె గాయాల్ని ఆలోచనల వెన్నతో అద్దుకుంటూ వెక్కిళ్ళు పోతున్న జీవితానికి గుండె పిండిదప్పిక తీరుస్తూ" దోసిలి పడుతున్నాడు. అపవాదుల గాయాల్ని ఆలోచనల వెన్నతో అద్దడమనేది చక్కని పద చిత్రం.

"ఆర్ద్రితశేని ఆలోచనలు
ముసిరినంతకాలం
ఈ హృదయం
ఎప్పుడైనా భగ్గుమనవచ్చు
అందుకే
కళ్ళ నిండుగా
నీళ్ళు నింపుకున్నాను" (ఫైంబ్రిగేడ్)

అనే ఈ కవిత కవి ఆర్ద్రి హృదయానికీ, ప్రతిభకూ మంచి నిదర్శనం.

ఈనాడు శరపరంపరలుగా వస్తున్న కవితా సంపుటాల్లో ఈ 'పద చిత్రాలు' ఒక ఉత్తమ సంపుటి అని చెప్పడం అతిశయోక్తి అనుకోను, ప్రతి కవితకూ భావాన్ని ప్రస్ఫుటీకరించే రేఖా చిత్రాలు వేయబడినాయి. లిథోప్రింటు చక్కగా ఉంది.

## శ్రీ వేంకటేశ ప్రదోష కాలస్తుతిః

రచన-"అర్షధర్మ విద్యాభూషణ"
వంగల రామకృష్ణశాస్త్రి
వెల రూ 2-00
ప్రతులకు-గ్రంథకర్త, సంపత్‌నగర్
గుంటూరు-4

పండితులైన శ్రీరామ కృష్ణశాస్త్రి ఈ సంస్కృత గ్రంథాన్ని సరసమైన శైలిలో భక్తి భావబంధురంగా రచించారు. ఇందులో 1. ప్రదోషకాలస్తుతిః 2. విజయ స్తుతిః 3. కరుణా-వ్యాప్తిః 4. మంగళనీ రాజం అనే నాలుగంశాలు ఉన్నాయి. కవిగారే ఆంధ్ర తాత్పర్యం వ్రాశారు.

ప్రదోషకాలస్తుతి సాయంకాలం పఠింపదగినది. ఈ కృతిలోని ఒక విశేషమేమిటంటే పదిశ్లోకాల్లో దశావతారాలను వర్ణించడం. ఇందులోని శైలిని తెలుసుకోవడానికి ఒక శ్లోకం ఉదాహరణ.

''సుధాసింధు మధ్యేశమానం మహాహే
ర్మృదు స్పర్శతల్పే పరిభ్రామ్యమాణమ్
శ్రియః పాదసంవాహనోద్యచ్ఛు భాంగం
ప్రదోషే సదా వేంకటేశం భజేహమ్"

—వేముగంటి

# హిందీ ప్రచారక విద్యాలయాలు

విజయవాడ, హైదరాబాదు, అవనిగడ్డ, తెనాలి కేంద్రాలలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసువారి ఆధ్వర్యాన హిందీ ప్రచారక విద్యాలయాలు ది. 2 సెప్టెంబరు 1988 నుంచి ప్రారంభించబడినవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు నడిపిన ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులు చేర్చుకొనబడిరి.

# వార్తావాహిని

## హిందీ విజయపత్ర వితరణోత్సవము

ది. 11.8.1983న దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యాలయ ప్రాంగణంలో హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి పక్షాన హిందీ విజయ పత్ర వితరణోత్సవం జరిగినది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉపాధి కల్పన, కార్మిక శాఖామాత్యులుగా. శ్రీ యం. రామచంద్రరావు గారు అధ్యక్షత వహించిరి.

గౌ. శ్రీ రామచంద్రరావు గారు జాతీయ భాష హిందీలో ధారాళముగా మాట్లాడుట అలవాటు చేసుకొనవలసినదిగా ఉపదేశము చేసిరి.

గౌ. శ్రీ హరిబాబుగారు తెలుగుతో పాటు హిందీ భాషను తప్పక నేర్చుకొనవలసిన అవశ్యకత గురించి నొక్కివక్కాణించిరి. ప్రభుత్వము హిందీ భాషాభివృద్ధికి తప్పక తోడ్పడగలదని హామీ నిచ్చిరి. ఈ మధ్య హిందీ పండిత పోస్టులను ఏర్పాటు చేసినట్లు విశదీకరించిరి.

ప్రారంభములో శ్రీ చవాకుల నరసింహ మూర్తి, హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు అతిధులకు స్వాగతము పలికిరి. హిందీ ప్రేమీ మండలి పక్షమున నిర్వహించుచున్న ఉచిత హిందీ తరగతుల గురించి వివరించిరి.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర విశేషాధికారి శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు సభ ద్వారా జరుగు హిందీ తెలుగు భాషల ప్రచారము గురించి ఉపన సించిరి.

మండలి కార్యదర్శి శ్రీ యమ్. ఆదనారాయణగారు వందన సమర్పణ గావించిరి.

—o—

## పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు

ది 5-8-83వ తేది సాయంత్రము 5-30 గం॥లకు శ్రీ మాజేటి గురవయ్య హైస్కూలులో పట్టణ హిందీ ప్రేమీ మండలి వారి ఆధ్వర్యమున నడుపబడుచున్న హిందీ విశారద విద్యాలయపు విద్యార్థుల సత్రాంత సమారోహము జరిగినది. ఈ సమావేశమునకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, విశేషాధికారి శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు అధ్యక్షత వహించిరి

మండలి అధ్యక్షులు శ్రీ గుడివాడ పుల్లారావు బి. ఎ గారు అతిధులను సభకు పరిచయము చేయుచూ, హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకతను గూర్చి ప్రసంగించిరి. మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమ హరనాధ శర్మ తన నివేదికలో మండలి కార్యక్రమములను గూర్చి, హిందీ భాషా అభివృద్ధికై మండలి చేయుచున్న కృషిని గూర్చి వివరించిరి.

సభాధ్యక్షులు, వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు తన ప్రసంగములో నేటి భారత దేశ పరిస్థితులను గూర్చి సమీక్షిస్తూ, నేటి విద్యార్థి తరమునకు కావలిసిన మంచి లక్షణములను గూర్చి ప్రసంగించి, మండలిలో జరుగు కార్యక్రమముల గూర్చి కొనియాడిరి. శ్రీ చావలి కోటేశ్వరరావుగారు, ప్రిన్సిపాల్, హిందీ విశారద విద్యాలయము, తమ ప్రసంగములో హిందీ భాషాభివృద్ధికై తీసుకొనవలసిన చర్యలను గూర్చి వెల్లడించిరి.

తదనంతరము సభాధ్యక్షులు శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగార్కి, శ్రీ జలగం రామారావు మెమోరియల్ హైస్కూలులో హిందీ పండితులుగా పనిచేసి రిటైరయిన శ్రీ ఓగిరాల పరబ్రహ్మ శాస్త్రి గార్కి, శ్రీ పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలులో హిందీ పండితులుగా పనిచేసి రిటైరయిన శ్రీమతి ఇ. పద్మావతి గార్లకు సన్మానము జరిగినది. సన్మానితులు తమకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞతలు తెలియజేసిరి.

రాబోవు పరీక్షలకు హాజరగుచున్న విద్యాలయ విద్యార్థులకు ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి, అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు తమ శుభాశీస్సులు అందజేస్తూ హిందీ భాషా ప్రాధాన్యతను గూర్చి ముచ్చటించిరి.

1982 ఆగస్టు పరీక్షలలో గుంటూరు కేంద్రము నుండి ప్రారంభిక తరగతులలో సర్వప్రధమ, ద్వితీయ తృతీయులుగా వచ్చిన విద్యార్థులకు జిల్లా అటవీ శాఖాధికారి శ్రీమతి పి యస్. రామలక్ష్మి ఐ. యస్. యస్. గారు బహుమతి ప్రదానం చేస్తూ, హిందీ నేర్చుకోవలసిన ఆవశ్యకతను గూర్చి వక్కాణించిరి.

శ్రీ డి. లింగేశ్వరరావు గారు కృతజ్ఞతలు సమర్పించిరి. జాతీయ గీతముతో సభ ముగిసినది. ✱

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర - హైదరాబాదు

ది. 28 ఆగస్టు 1983 నాడు హైదరాబాదులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, కార్యనిర్వాహక వర్గ సమావేశంలో

శ్రీ ఎం. వి. పాపన్నగుప్త,
మదనపల్లి
ఆంధ్రశాఖకు అధ్యక్షులుగాను

శ్రీ కట్టా పూర్ణానందరావు
ఏలూరు
ఉపాధ్యక్షులుగాను

శ్రీ అల్లా సూర్యనారాయణ,
ఏలూరు
కార్యనిర్వాహక వర్గ సభ్యులుగాను

ఎన్నుకొనబడినారని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

హైదరాబాదు
ది. 1-9-1983

వేమూరి రాధాకృష్ణ మూర్తి
విశేషాధికారి